## కోకా-కోలా సాంగత్యం బ్రతుకే ఒకసారస్యం

ఉమ్మడిగా తినటంలో ఉన్న మజాయే వేరు! దానికి కోకా-కోలా తోడైతే పసిడికి పరిమళమబ్బినట్లే! ఉల్లాసం, ఉత్తేజం కలిగించే సజీవమైన రుచి కోకా-కోలా రుచి. అందుకనే, త్రాగాలనిపిస్తుంది మళ్ళీ మళ్ళీ. త్రాగండి కోకా-కోలా—మళ్ళీ కోకా-కోలా—మళ్ళీ మళ్ళీ కోకా-కోలా! ప్రపంచంలో నలుమూలలా, పెరిగిపోతోంది కోకా-కోలా త్రాగేవారి సంఖ్య రోజు రోజుకూ. కారణం: సేదదీర్చటంలో, కనివిని ఎరుగని కమ్మదనం కోకా-కోలా కమ్మదనం!




కోకా-కోలా, కోకా-కోలా కంపెనీవారి రిజిస్టరు చేయబడిన ట్రేడ్ మార్కులు.

CMCC-17-162 TEL




సచిత్ర మాస పత్రిక

26, బర్కెట్ రోడ్,

టి. నగర్. మద్రాసు-17,

విడి ప్రతి వెల

1 రూపాయి

ఏడాది చందా

పన్నెండు రూపాయలు

సంపుటి 8

అక్టోబర్ 1970

సంచిక 11

మేనేజింగ్ ఎడిటర్.

వి. వి. రాఘవయ్య.

Ebited and Published by V. V. Raghavaiah and Printed by K. Damodaram at Sri Kala-Printers, 83, Lake view Road, Madras-33.




ముఖచిత్రం

ఉత్తమ చిత్ర

'మనసూ–మాంంగల్యం'లో

నాగేశ్వరరావు

జమున.

# తొలిమాట

అంతంత మాత్రం ఆగని ఝంఝా మారుతంగా ఆంధ్రదేశాన్ని అదళించిన ఝంఝ ఆంధ్రదేశం ఆదరిస్తోందో అవలిస్తోందో వేచి చూడాలి. అందుకే ఝంఝ ఏమన్నది-ఏమైనది—— (111 పేజీ)

* * *

పదబంధప్రహేళిక-పదిమందే అన్పించిన మాకు-అభిమానుల సంఖ్య-వేలకు దాటింది. ఎంతో సంతోషం. అందరికీ మా వందనాలు. అందుకోసం ఈ శీర్షిక కొంతకాలం నడుపుతాం. (13 పేజీ)

* * *

లిమరుక్కులు ప్రస్తుతానికి ఆపిన మహాకవి శ్రీ శ్రీ మళ్ళీ ప్రాస క్రీడల్లో మిమ్మల్ని పలకరించబోతున్నారు. (59 పేజీ)

* * *

కథకుడు 'ఆదివిష్ణు' రాసిన సీరియల్ 'రాక్షసి....' కిందటి సంచికలో పూర్తయింది. సరికొత్త సీరియల్ 'శిక్ష' ప్రస్తుతం జాంబియాలోని ప్రవాసాంధ్రి మాదిరెడ్డి సులోచన చెస్తారు. (17 పేజీ)



# డిసెంబర్ సంచికలో....

సృష్టిలో అతి కష్టమైనది

—అజ్జరపు హనుమంతరావు

జాతికుక్క

—అల్లంశెట్టి శేషగిరిరావు

మా యింటి దీపం

—యఱ్ఱంశెట్టి సాయి

ఆ రైలు ఇక రాదు

—సుమన్

బోయ్ మీట్స్ గర్ల్

ఎ. ఎస్. ఆర్. చంద్రప్రసాద్

—ఇవిగాక, యద్దనపూడి సులోచనారాణి, మాదిరెడ్డి సులోచనగార్ల సీరియల్స్, శ్రీ శ్రీ ప్రాసక్రీడల్తో....ఇంకా అనేక ఆకర్షణల్తో వెలువడ్తోంది




మరోలా భావించకపోతే ఒకమాట. తిట్టు కవిత్వరచనలు ఎవరినుండి వచ్చినా నిర్దాక్షిణ్యంగా మా ఎడిటర్ కత్తెరకు పని బెట్టండి. అభిప్రాయ భేధాలున్నంత మా త్రాన బజాడుకు దిగవలసిందేనా? మీ పత్రిక పతిష్ట దీనివల్ల పెరగదు. మంచి ప్రమాణాలతో వెలువడుతూ వచ్చిన 'జ్యోతి' నిదిగజార్చే ఏ రచననుకూడా మీరు ముద్రించుకోరని నమ్ముతున్నాము. దాశరధి గారు కవిగా (పజదె వ్యక్తిగా ఇంత అల్పబుద్ధి అనుకోలేదు. నాగురించి తిట్లు వ్రాశారనేకాదు, అధృక్పధమే రోత. శ్రీ. శ్రీ. రాసిన తిట్టు కవిత్వమైనా అంతే.

కె. వి. రమణా రెడ్డి,
కావలి
(నెల్లూరుజిల్లా)

అక్టోబరు జ్యోతిలో ప్రచురింపబడిన "శ్రీతిలక్" గారి "మాతృమూర్తి" కథ చదివాము. అది 'మధ్యమ హిందీపరీక్షల కుద్దేశింపబడిన" నరక్‌కహానియా"రోని", పీరమాత అనుకథకు అనుకరణయని తెలుపుటకు చింతించుచున్నాను. దీనిపై రచయిత అభిప్రాయాన్ని తెలియకోరు చున్నాను. ఈ కథ రచించుటలో నారి ఉద్దేశ్యమేయో తెలియకున్నది.

ఎం. ఎస్. చలపతిరావు,
కాకినాడ.

అక్టోబరు 'జ్యోతి' అందముగా అలంకరించుకొంది. లిమబుక్కులు బాగా ఆకర్షించాయి. శ్రీ శ్రీ కలంతో కదలిన భావ తరంగాలు మా హృదయాలను కదలించాయి. కనిపెంచిన కన్న తల్లితండ్రులనే సంకుచిత భావాలతో నీచంగా ప్రవర్తించే కుమారులకు పీతిపాఠంలా ఉంది. చదువుచున్నంతసేపు హృదయ విదారకంగా స్ఫురించింది కళ్లు చెమ్మగిల్లాయి. ఇంకా చక్కని రచనల కూర్పుతో పాఠకుల హృదయాలను కదలిస్తారనే ఆకాంక్షతో ఎదురుచూస్తున్నాము.

ఎ. నీలకంఠం,
ఎ. కాంత,
సిర్పూర్ కాగజ్‌నగర్.

అక్టోబరు జ్యోతి చదివాము. చాలా బాగుంది. శ్రీ, శ్రీ గార్కి మా అభినంద నలు. శ్రీ కిరణ్‌కుమార్‌గారి "వ్యధిత హృది" మాకు బాగా నచ్చినది. గిల్టి కాన్షస్ ఎంత బాధాకరమో రచయిత చక్కగా చిత్రించినారు. శైలి బాగుంది. రామారావుగారి బొమ్మలు ప్రత్యేక ఆకర్ష ణగా ఉన్నవి.

యడవల్లి వసుంధర,
యడవల్లి సుబ్బారావు,
భువనేశ్వర్-3.

యీ నెల జ్యోతి చాలా బాగుంది. ముఖ్యంగా "మిలట్రీబొమ్మ" "మాతృ మూర్తి" కథలు రెండు చాలా బాగున్నవి. అజ్జరపు హనుమంతరావు వ్రాసిన "శాప గ్రస్తులు" ప్లాటు బాగుంది. కొంచెం శ్రద్ధ తీసుకున్నట్లయితే కథ యింకా బాగుండేది. శ్రీ శ్రీ పదబంధ ప్రహేళిక నిజంగా మెదడుకు మేతే! లిమరుక్కులు ద్వారా యీ కవి ఏమి సాధిస్తాడో వేచి చూడాలి, మొత్తాని కీనెల జ్యోతి నిజంగా జ్యోతే.

ఎం. ఎస్. రావ్,
రాంచీ-8.

అక్టోబర్ నెల "జ్యోతి" చాలా బాగుంది. 'శాపగ్రస్తులు', 'మిలట్రీబొమ్మ' 'మాతృమూర్తి' కథలు బాగున్నవి. రచయి తలకు అభినందనలు తెలియచేయండి. శ్రీ శ్రీ, ప్రహేళిక ఇంట్రస్టుగా ఉంది. ఇంకా ఆలోచించుటకు వీలుగా ఉండే విధముగా ప్రహేళికలు ప్రవేశపెడ్తారని ఆశిస్తాను. సీరియల్ బాగానే ఉంటుంది. దీపావళి స్పెషల్ సంచిక బాగానే ఉంది.

వి. ఎస్. ఎస్. హనుమంతరావు,
వి. వి. సుబ్బారావు,
తణుకు.

లిమరుక్కులు చదివి చలంగార్ని తలుచుకున్నాను-ఆయన 1940 లో మహా ప్రస్థానానికి యిచ్చిన యోగ్యతాపత్రం జ్ఞాపకం వొచ్చి.

నయసు మళ్ళి, ఎముకలు కుళ్ళగానే మహాకవుల కలాల్నించి కూడా యిలాంటి కవిత్వం వొస్తుంది గావును నెత్తురూ, కన్నీళ్ళూ కలిపి తయారుచేసిన 'మహా ప్రస్థానం' టానిక్ పుచ్చుకున్న తెలుగు పాఠకులకు యివి నిస్పృహ కలిగిస్తు న్నాయి-కొన్ని విషయాల్లో.

'జగన్నాథ రథ చక్రాల్ని' ఆకాశపు దారుల్నించి మళ్ళించి పతితుల కోసం, బాధా సర్పదష్టుల కోసం భూమార్గం పట్టి స్తానన్న కవిత్వం సినిమావాడల సైడు కాలవల్లోంచి ప్రవహించినపుడే ఆది 'రాబందుల రెక్కల చప్పుడ్నించీ', 'పయో ధర ప్రచండఘోష' నించీ తప్పుకుని ఎయిర్ కండిషన్డు గదుల్లోనూ, వీణావేణు మృదంగ సహిత ప్రేమ గీతాల్లోనూ సద్దుకుందని తెలిసింది. మరెవరో కూడా తనలాటి 'కిరాణాకొట్టు' పెట్టినపుడు ఎ

నక్కెందేనికి? పిసీ ప్రపంచం పిలిచిందని 'తోసుకుని పైపైకి' పోయిన వారు గురి వింద గింజని గుర్తుపెట్టుకుంటే మంచిది. విప్లవ సాహిత్య కన్యని పిసీ ప్రభువులకి అంకితం యిచ్చి, ఆ పిసీకూడు భుజించి మహాకవులు మార్గదర్శకులైన సంగతి వారు మర్చిపోతే ఎలాగ?

ముప్పై సంవత్సరాల కాలంలో నవ కవితకి కావల్సిన సామగ్రిని 'ఘాటెక్కిన గంధక ధూమం', 'ఝుంఝూనిల షడ్జ ధ్వానం' నించి "నల్లులూ, రుద్రాక్ష పిల్లులూ, యింకా వాళ్ళ తల్లులికి" కూడా మార్చారు. అఫ్‌కోర్స్, 'కాదేదీ కవిత కనర్హం'!

పోతే, జ్యోతిలాంటి పత్రికమీద ఆశలు పెట్టుకున్న పాఠకులికి చివరికి-

"ఏ తెలుగుపత్రిక చూసినా
ఏమున్నధి గర్వకారణం.
విప్లవ సాహిత్య సమస్తం
పరదూషణ పరాయణత్వం" - అని

పిస్తోంది.

మహాప్రస్థాన కర్తలు, విప్లవ సాహిత్య వాగను శాసనులు, మహాకవులు యిక వానప్రస్థులు కావటం మంచిదేమో నని పిస్తోంది.

వారు సైతం
వృద్ధులైనారు.

భవదీయుడు
వి. యస్. ఎ.
విశాఖ-4

---

ఈ రెండిట్లో ఏ మొత్తం పెద్దదో చెప్పుకోండి?!

| | |
|---|---|
| 987654321 | 123456789 |
| 87654321 | 12345678 |
| 7654321 | 1234567 |
| 654321 | 123456 |
| 54321 | 12345 |
| 4321 | 1234 |
| 321 | 123 |
| 21 | 12 |
| 1 | 1 |
| 1083676269 | 1083676269 |

జవాబు:-నమ్మండి-నమ్మకపోండి. పై రెండువరసల మొత్తము ఒకటే!



# నరుడే నాయక

రామవరపు వేణుగోపాలరావు

"అచ్చుగా నాలాగే వున్నాడు కాని నా కుండే తోక మాత్రం లేదు' అంది కోతి.

"కళ్ళు నా కళ్ళ లాగే ఉన్నాయి అంది పిల్లి.

"ఆకారములో నే నే నయం'' అని నవ్వింది భల్లూకము.

'ఒంటిమీద వున్నదేదో నా చర్మంలా వుంది'' విస్మయంగా అంది జీబ్రా.

నిండు కొలువు తీర్చిన సింహం అన్నీవింది. సింహానికి అటు ఏనుగులు-ఇటు చిరుతపులులూ వున్నాయి. భల్లూకాలూ, నక్కలూ, తోడేళ్ళు, కాస్త పక్కగా దుప్పులూ, లేళ్ళు నిలబడి అంతా దీర్ఘంగా వింటూ మేత నెమరేస్తున్నాయి. చెట్లమీద కాకులూ, కొంగలూ, కోయిలలూ, పిచ్చుకలూ, పావురాలూ, గెద్దలూ, గుడ్లగూబలూ, రాబందులూ, నిశ్శబ్దంగా కూర్చున్నాయి.

"సరే, ఆ కొత్త జంతువు పేరేమిటి? ' అంది సింహం దర్పంగా.

"అదే మాకు అర్థం కావడం లేదు.'' అన్నాయి అన్నీ ముక్తకంఠంతో.

సింహం కాసేపు దీర్ఘంగా ఆలోచించింది. ప్రక్కనున్న పులితోనూ, ఏనుగుతోనూ రహస్యముగా చర్చించింది.

"సరే-సభ్యులేం నిశ్చయించారో చెప్తే నేను ఒక నిశ్చయానికి వస్తాను '' అంది సింహం సమస్యని సభ్యుల ముందుపెడ్తూ.

"ఆ కొత్త జంతువుని మనలో కలుపుకుందాం. మన లోకానికి ఆహ్వానిద్దాం.'' అని ప్రతిపాదించింది నక్క. మిగతా జంతువులన్నీ ఆ ప్రతిపాదనని ఏకగ్రీ



వంగా ఆమోదించేయి.

అంతలో ఓ ముసలి నక్క నెమ్మదిగా మృగరాజు దగ్గరికి నడిచింది చిన్నగా దగ్గి ఇలా అంది. "మిత్రమా, చుట్టూ సముద్రం ఆవరించుకొనివున్న ఈ ద్వీపంలో. ఈ అడవి నీడలో మనం ఎన్నో ఏళ్లుగా ప్రశాంత జీవనం గడుపుతున్నాం. మనలో ఏ కలతలూ కార్పణ్యాలూ లేవు. ఇప్పుడా కొత్త జంతువు మంచి చెడ్డలు తెలుసుకోకుండా మన సంఘములోకి ఆహ్వానించడం మంచిది కాదేమోనని నేను భావిస్తున్నాను."

గుర్రం నెమ్మదిగా సకిలించి. గాడిద చెవిలో ఏదో చెప్పింది. రెండూ నెమ్మదిగా మృగరాజుని సమీపించేయి. "బాబూ, ఈ ముసలి నక్కకి ఎప్పుడూ అనుమానాలే. అదలా వుంచి, ఆ కొత్త జంతువుని మనం మనసారా నమ్ముదాం, ఆహ్వానిద్దాం. మన సంఖ్యా బలం కూడా పెరుగుతుంది. మనకన్నా అ జంతువు తెలివిగలదైతే దాని సలహాలు ఆచరణలో పెడదాం. మన బ్రతుకు మెరుగు పర్చుకుందాం." అని అన్నాయి.

సింహం సాలోచనగా తలూపింది.

జంతువులూ, పక్షులూ మరోసారి ఆ ప్రతిపాదనని ఏకకంఠముతో బలపర్చేయి.

దీర్ఘంగా వూపిరి వదలి సింహం నిలబడింది.

"సరే, ఆ జంతు వెక్కడుంది?"

"సముద్రపు ఒడ్డునుంది. ఏదోదూలము

పట్టుకొని ఒడ్డుకివచ్చి అటూ ఇటూ తెగ చూస్తున్నాది. మన అరటిపళ్లు తెగ తింటున్నాది.!'

"సరే - సముద్రపు ఒడ్డుకి వెళదాం, పదండి," అంటూ మృగరాజు ముందు దారి తీసింది. మిగతా జంతువులు నేల మీదా-పక్షులు గగనమార్గంలోనీ సింహాన్ని అనుసరించేయి.

మధురమైన అరటిపళ్ళు తింటూ పక్షం రోజుల ఆకలి దప్పులు తీర్చుకుంటున్న నరుడు ఒక్కసారి తృళ్ళిపడ్డాడు. ముద్ద గొంతుకడ్డం పడింది. చప్పున లేచి నిలబడ్డాడు.

రెండు ఫర్లాంగుల దూరంలో సింహం వుంది. దాని వెనుక ఎన్నో క్రూర మృగాలు. అంతేకాదు అందులో ఆవూ మేక గొర్రెల్లాంటి సాధుజంతువులు కూడ వున్నాయి. కాస్త మీదుగా కొంగలు కాకులు గెద్దలు ఎగురుతూ వస్తున్నాయి. ఏం చేయాలో పాలుపోలేదు నరుడుకి. దగ్గర్లో కొబ్బరి చెట్టు పెన్నిధిలా కన్పించింది. కాళ్ళకి బుద్ధిచెప్పి గబగబ చెట్టెక్కేడు. చెట్టెక్కి కూర్చున్నాడే గాని నరుడి గుండెల్లో గుబులు తగ్గలేదు. కిందనున్న జంతువుల్లో భల్లూకం వుంది. కోతులు కూడ ఉన్నాయి. పాములూ ఉన్నాయి. ఇవి కాస్తా తనతోబాటే చెట్టెక్కి తనని స్వాహా చేస్తే! కడుపులో అరటిపళ్ళు వాంతి అయిపోయేట్టున్నాయి. తల తిరుగుతోంది.

"ఇదేమిటి ఈ జంతువు చెట్టెక్కిందేం"" అంది సింహం ఆశ్చర్యముగా.

"మనల్ని చూసి భయపడ్డట్టుంది. అందుకే చెట్టెక్కింది.' అంది ముసలి నక్క.

"సరే, భల్లూకమిత్రమా! నువ్వుపోయి చెట్టెక్కి ఆ కొత్త జంతువుని సగౌరవంగా తీసుకురా!'' అని ఆజ్ఞాపించింది మృగరాజు.

"ఒద్దు ప్రభూ, వద్దు! అలా చేస్తే అ జంతువు భల్లూకానికేదేనా ఆపకారము తలపెట్టొచ్చు. తనకై తానే దిగనివ్వండి." అంది నక్క ముక్కు చీదుకుంటూ.

"సరే - నీమాట ప్రకారమే కానీ!" అంటూ చతికిలబడింది, మృగరాజు మిగతా జంతువులుకూడ విశ్రాంతిగా చేరబడ్డాయి.

చెట్టుమీద నున్న నరుడు కాస్త సంబాళించుకున్నాడు. భయం కొంచెం తగ్గింది. కిందనున్న దృశ్యంచూసి బాగా ఆలోచించసాగేడు.

పులిపిల్ల ఆవుపాలు తాగుతోంది. దూడా సింహం పిల్ల ఆటలాడుకుంటున్నాయి.

చిట్టెలుక మృగరాజు వీపుమీద ఎక్కి కూర్చుంది. మేకపిల్ల నక్క పొదుగు కుమ్ముతో ఆకలి తీర్చుకుంటోంది. ఓ చుంచెలక నాగుపాము పడగమీద ఠీవిగా కూర్చుంది. గెద్ద పక్కని కోడిపిల్లలు పావురాయిలూ కలకలమని చప్పుడుచేస్తూ తిరుగుతున్నాయి. సింహం ఉండుండి

తలెత్తి కొబ్బరి చెట్టుమీదకి చూస్తోంది.

చెట్టు దిగినంతవరకూ వీళ్ళిక్కడే వుంటారన్న నిశ్చయం చేసుకున్నాడ, నరుడు, దిగకపోతే తనకే ముప్పు అని కూడ నిర్ధారణ చేసుకున్నాడు. దిగినందు వల్ల వుపకారమే తప్ప అపకారము జరుగ దనుకున్నాడు కూడా! ఆ విధంగా అను కున్న వాడై నెమ్మదిగా కొబ్బరిచెట్టు దిగేడు.

"స్వా గ త ం! సుస్వాగతం!!" అన్నాయి జంతువులన్నీ.

"దయచెయ్యి...." అంటూ పక్షులు కమ్మగా పాడేయి.

కాసేపయ్యాక——

పిచుకలు గడ్డి తెచ్చి చెట్టుకింద మెత్తని పాన్పులేసేయి, ఆవు పాలు పితికి కొబ్బరి చిప్పలో నరుడి ముందు పెట్టింది కోతి. జీడిపప్పు - సెనగపలుకులూ-వెలగ పళ్ళూ తెచ్చి యిచ్చింది ఎలుగుబంటి: ఏను గులు తమ చెవులో నరుడికి గాలి వీచేయి ఫలహారం. చేశాక నరుడు నిలబడ్డాడు. దీర్ఘంగా త్రేన్చేడు.

"మహాశయా, నీలాంటి జంతువుని చూడడం ఇదే ప్రథమం. నువ్వెవరు? నీదే వూరు? ఇక్కడి కెలా వచ్చేవ్? సవివ రంగా చెప్పు!" అంది సింహం అప్యా యత వుట్టి పడ్తున్న కంఠంతో.

"మిత్రులారా, నేను నరుడిని నా దేశ ప్రభుత్వం వియత్నాంలోని యుద్ధభూమికి పంపింది. వెళ్తూ వెళ్తూ విమానం పాడ వడం వల్ల సముద్రములో పడిపోయేను. ఒక దూలం అదృష్ట వశాత్తూ దొరికింది. దాన్ని ఆసరాగా చేసుకుని ఇక్కడికి వచ్చాను. మీ చెలిమీ, మీ కలుపుగోలు తనమూ నాకెంతో నచ్చేయి. మీ అభి మానం నన్ను ముగ్ధుడిని చేసింది. చుట్టూ నీలిరంగు సముద్రం. తెల్లగా ఆకాశం, పచ్చగా ఫలవృక్షాలు ఈ ద్వీపం-ఈ అడవి మనోహరంగా వున్నాయి. నన్నిక్కడే మీతో బాటే జీవించే అవకాశము కలగ జేసినందుకు మీ అందరికి కృతజ్ఞుడిని." అంటూ వుపన్యాసం ముగించేడు నరుడు.

నరుడూ, జంతువులూ, పక్షులూ, కలసి మెలసి సరదాగా కొంతకాలం జీవించేయి.

*　*　*

కొన్నాళ్ళకి ఆ ద్వీపంలో విచిత్ర మైన సంఘటనలు జరగడం మొద లెట్టాయి.

వుండుండి కోడిపిల్లలు మాయమవ సాగాయి. మేకపిల్లలూ అలాగే కన్పిం చడం లేదు చిట్టెలుకల సంఖ్య క్రమ ముగా తగ్గసాగింది. పులులు బిలుస్తు న్నాయి. నక్కలు నాలికలు తడి అర్చుకో టానికి శ్రమపడుతున్నాయి. కొత్తరకం రుచిని చిరుతలు కలలో కూడా గుర్తుకి తెచ్చుకొని లొట్టలు వేయసాగాయి.

మరి కొన్నాళ్ళకల్లా——

ఆ వు ల న్నీ ఒక సంఘంగానూ. మేకలూ - గొర్రెలూ - దుప్పులూ - లేళ్ళూ మరో సంఘంగానూ ఏర్పడ్డాయి, కప్పలూ

ఎలుకలూ - చిట్టెలుకలూ వేరె సంఘం స్థాపించుకున్నాయి. పాములు, తేళ్ళు మరో సంఘం అయ్యేయి పక్షులు కూడా వేరే వేరే సంఘాలు స్థాపించుకున్నాయి. పులులూ-సింహాలూ-.రుతలూ వేరే సంఘం. నక్కలూ-భల్లూకాలు మరో సంఘం....ఇల్లా చెల్లా చెదరయ్యాయి. సఖ్యత లోపించింది. పరసంఘ పఖ్యుల సహనం లోపించింది....సంఖ్య కూడ తరగసాగింది.

మరికొన్నేళ్ళకి—

పాములు పుట్టల్లో దాక్కోసాగేయి. నక్కలు బొరియల్లో దూరేయి. తుపాకి దెబ్బతిన్నవి చావగా మిగిలిన సింహాలూ-పులులూ బోనుల్లో ఇరుక్కున్నాయి. ఆవుల మెడలికి తాళ్ళు, వాటి పాలు నరులకి ఆహారం అయింది. మేకలు గొర్రెలు బలవంతంగా చంపబడి నరుల డైనింగ్ టేబిళ్ళ మీదకి ఎక్కేయి.

దీంతో సరా—

ఆ అడవిలో జంతు సంఖ్య తరిగింది నరులసంఖ్య పెరిగింది.

అంతేకాదు—

వాళ్ళలో కూడ పార్టీలు పెరిగేయి. గ్రూపులు చెలరేగేయి. జాతులు మతాలు ఎన్నెన్నో ఏర్పడ్డాయి ఓట్లు వచ్చేయి. నోట్లూ వచ్చేయి.

దోపిళ్లు మొదలయ్యేయి.

మానభంగాలు ప్రారంభమయ్యేయి.

యుద్ధాలూ రాసాగేయి.

సినిమా లొచ్చేయి.

వ్యభిచార గృహాలొచ్చేయి.

హోటళ్లు వచ్చేయి.

ఇంతెందుకు, నాగరికత వచ్చేసింది.

ప్రజాస్వామ్యం, ధనికవాదం, కమ్యూనిజం అంటూ నినాదాలు మొదలయ్యేయి.

దేవుళ్లు దెయ్యాలు బాబాలు పీఠాలు వెలిసేరు.

ఎక్కువ్వాళ్ళూ తక్కువ్వాళ్ళూ వేరు వేరయ్యేరు. బలవంతులూ బలహీనులూ ఏర్పడ్డారు.

ఇకనేం—

మారణహోమం మొదలైంది.

ఇంకేముందీ కథ?

అంతా సరా మామూలే!!

---

## వాచేపిటీ

'ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికా' లో మిడ్‌వైఫరీగురించి నలభై పేజీలూ, అణువు(Atom) గురించి కేవలం ఒకపేరామాత్రమే కేటాయించారు.

# పదబంధ ప్రహేళిక

శ్రీశ్రీ





## అడ్డు

2. విశ్వనాథ సత్యనారాయణలో ఉన్న రెండిట్లో ఒకటి మదీయం

4. వ్యథా రహిత వ్యవధానము, అదే అడవి అదే నీరు

6. ఒక బెజవాడ పిక్లి, తల తేమ

8 ఈ నాటి సాహిత్య బాధ్యతా భారం ఎవరి మీద ఉంది?

10 ఎప్పుడూ హృదయంలేని సరదా

11. ఇదీ వరస

12 పాతకాలపు ఉత్తరాలలో తమరూపం

13 గురుద్వయం: ఉదాహరణకు శ్రీ.శ్రీ

14 ఈ సెంటిమెంటల్లో గల పానీయం

15 వెలిగించే తెలుగుమాట: ఉప్పుతో ఒక్క పోలిక

17 కుటుంబ నియంత్రణం అంటే సంతానం తగ్గించుకోవడం

18. మన సమస్యలు దేనితో పూర్తి?

20. లుంగీకి స్త్రీలింగం?

21. జనక నందనుడిలో వెనక నించి మూడక్షరాలు: అర్థం ఏమిటని అడగొద్దు

22 శివుని గొంతుకలో, విష్ణుని గుండెల మీద

## నిలువు

1. ఊక దంపుడు, బహుశా శాసన సభల్లో
3. తాపకప్రథగల జత: ఒక జానపదగాథ
4. 60 లో ఒకటి తిరగెయ్యి
5. ఇదికూడా తిరగేస్తే తాడు
7. ఒక బొట్టు (కుంకుమతో కస్తూరితో)
9. తిరగ బడ్డ నోరు; ఇవియాకు వ్యావ

హరిః ఓం

15 లంక కొనమంచి లంక మొదటి దాకా: మధ్యని మధ్యకి ప్రారంభం ఇదో పువ్వని పేరే చెప్పాలా?

16. మురఘస్మరుని "చిరు" నామా

17. మహారాజు మాజీరాజ్యం

19. అవనాకారరహిత మజ్జాక్షి మేను

---

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 సి | 2 రా | ■ | 3 ఈ | 4 గ | ■ | 5 ప్ర | ■ | 6 జ్యో |
| ■ | రా | ■ | 7 త | ఢ | ■ | 8 జ | గ | తి |
| 9 చీ | రా | 10 ల | ■ | 11 ప | 12 గ | లు | ■ | ■ |
| ■ | ■ | 13 కు | 14 చే | లు | రు | ■ | 15 గో | 16 హా |
| 17 వ | 18 సు | మ | తి | ■ | 19 డు | 20 ము | వు | లు |
| 21 గ | డి | ■ | 22 ప | 23 గ | డా | లు | ■ | ■ |
| ■ | ■ | 24 ద | ని | త | ■ | 25 గు | 26 రు | పు |
| 27 రా | జా | జీ | ■ | 28 కాం | 29 రా | ■ | వ్వ | ■ |
| ఫ | ■ | ఝ | ■ | 30 లం | కే | ■ | 31 టె | పాం |

కరెక్టుగా పంపినవారు:—

1. భట్టారం ఉదయిని, కరీంనగర్.
2. పడెందల సత్యనారాయణమూర్తి, భీమవరము
3. డి. రామ్మోహన్‌రావు. హైదరాబాదు.
4. డాక్టర్ పి. బాబూరావు. తిరుపతి.

# 3 నం. క్రాస్వర్డు పజిల్ మీద శ్రీ శ్రీ రిపోర్టు

ఈసారి విజయుల సంఖ్య బాగా తగ్గింది. కుప్పుస్వామయ్యర్ మేడ్ డిఫికల్ట్ అన్నట్టు కొంచెం కఠినంగానే సెట్ చేశాను. నలుగురు ఆల్ కరెక్టుగా పంపించారు వారికి నా అభినందనలు. కనిగిరి నుండి శ్రీమతి అరుణా పార్వతీశంగారు 24 నిలువుకి వజీర్ అని పొరపాటు పడి అన్ని గళ్ళు నింపేరు. వజీరు అని వుండాలి. ఈ టెక్నికల్ మిస్టేక్ మినహాయిస్తే ఈవిడను కూడా అభినందించాలి కూడబలుక్కున్నట్టుగా తిరుపతి నుంచి చాలా మంది ఒకే తప్పుతో పంపించారు. ఆది 9 అడ్డు, మరో రైలుస్టేషన్ అని క్లూ! చీరాల రైటు, కాని అందరూ పేరాల అని వ్రాశారు. పేరాలకు రైలు స్టేషను లేదు. 29 నిలువు అచ్చులో తప్పు పడింది. సాధ్యమైనంతవరకు అచ్చు తప్పులు లేకుండా వుండేందుకు ప్రయత్నిస్తున్నాం.

పజిల్ నం 4.

ఒక విధంగా ఇది పదబంధ ప్రహేళిక కాదు, ఇంకో పదంతో సంబంధం లేని ఏకాక్షర పదాలుండడంవల్ల ఇది పదప్రహేళిక మాత్రమే. ఇదీ కొంచెం కష్టంగానే ఇచ్చాననుకుంటాను, అయినా ఆల్ కరెక్టు సొల్యూషన్ల కోసం ఎదురు చూస్తున్నాను.

అందరి విజయం ఆకాంక్షిస్తూ

శ్రీ శ్రీ.

(సూచన: ప్రతి నెలా 20 వ తేదీలోగా మీ సమాధానాలు "జ్యోతి" కార్యాలయానికి అందాలి.)

పెర్రీమేసన్ అనే ప్రైవేట్ డిటెక్టివ్‌ని సృష్టించిన ఎర్ల్ స్టేన్లీగార్డ్‌నర్ రచ తన పాతజ్ఞాపకాల్ని ఇలా చెప్పాడు:-

"మాటకి మూడుసెంట్లు చొప్పున రాసేకథకుడు మాటలసంఖ్యపట్ల గొప్ప పట్టింపుగా వుంటాడు నిజానికి నా సొంతకథల్ని టైప్ చేస్తున్నప్పుడు-నా టైప్-రైటరు స్పేస్ బార్‌కి పదాల్ని కూడే యంత్రాన్ని జతకూర్చేవాణ్ని. అలా స్పేస్ బార్‌కి తగిలేసరికల్లా ఎన్నిమాటలుకొట్టేనో మాటలకౌంటర్లో ఆ సంఖ్యరాసేవాణ్ణి అంచేత నాకు తెలిసుంటానే నా కథలో హీరోలు మొదటి అయిదుకాల్పుల్ని వృథాచేసి ఆఖరిబులెట్‌తో నిజమైనతాకిడి ఎగర వేయడానికి అలవాటుపడ్డారు ఒకసారి ఒక ఎడిటరు పనిప్పెట్టుకని ఇదే అడిగేడు నా కథలో హీరోలు ఎప్పుడూ మొదటి అయిదుకాల్పుల విషయంలో ఎంచేతఖరాదుగా గన్‌షూట్‌గా వుంటరని"

"ఆ ఎడిటరుతో విర్మోహమాటంగా ఇలాచెప్పేనేను· మాటకి మూడుసెంట్లు చొప్పున-ప్రతిసారి నేను 'బేన్' (bang) అని కథలో రాసినప్పుడు నాకు మూడుసెంట్లు దొరుకుతాయి. నాహీరో తుపాకీతో 15 సెంట్లు విలువచేసే నిత్యమైన మందుగుండుసామానుని ఉపయోగించనివ్వకుండా ఫస్ట్‌షాట్‌కే తుపాకీయుద్ధం పూర్తి చేసేమంటారా, భలేవారే!"

* * *

కెనడా హాస్యరచయిత స్టీఫెన్ లీకాక్ ఒకసారి ఓ కాలేజీలో సంవత్సరానికి రు 5.2501-చొప్పున పాఠాలుచెప్పేవాడు. ఆ జీతం అతనికి గొర్రెతోకలా కనిపించింది. పంచెయ్యడానికి పాలుపోలేదు. అయితే ఒకసారిలా బోర్డ్ ఆఫ్ గవర్నర్స్‌కి ఉత్తరం రాసేట్ట:

"పెద్దలారా, నా స్టయిపెండు తక్షణం పెంచకపోయినపక్షంలో నేను బల వంతంగా, అనిష్టంగా"-ఇక్కడ మిగతాఉత్తరంముగింపు చదవడానికి పేజీ

తిప్పాలి-అదేమిటంటే-"అదేజీతానికి పనిచేయకతప్పదు."

కొత్త సీరియల్:



మాదిరెడ్డి సులోచన

చీకటి ఇంకా చిక్కగానే ఉన్నది.

పక్షుల కిల కిలారావములు మందముగా వినిపిస్తున్నాయి. నిద్రాదేవి జోకొడుతున్నా, బద్ధకాన్ని దూరంనెట్టి లేచితన దినచర్యలో లీనమయింది సుశీల. పట్నవాసమే. అయినా చవక ధరకు స్థలం కొని ఊరు చివర ఇల్లు కట్టారు ఉమాపతి. పెరడు పెద్దది. మొక్కలతో చీకట్లో మరీ నల్లగా కనిపిస్తుంది. అలవాటు పడిన సుశీల నిర్భయంగా తలుపులు తీసి లోపల కెళ్ళింది. దూరాన వున్న నీళ్ళ గదిలో నిప్పుచేపి బాయిలర్‌లో వేసింది. వంటింటి తాళం

పి అంట్లన్నీ పంపు దగ్గర పడవేసు కుంది. నగం అంట్లు తోమినాక గుర్తు కొచ్చింది. తల వాకిలి చిమ్మాలని.... కొంచెము వెలుతురు వచ్చిందా, తనకు న్నది తద్దినము. చేతులు కడుక్కొని చీపురు పట్టుకుని బయటికి వచ్చింది. పక్క ఇంట్లో వుంటున్న పోలీస్ ఇన్‌స్పెక్టరు దాపి అప్పుడే వచ్చి తలుపులు తడుతుంది.

"ఎవరూ! నర్సమ్మా?" సుశీల చీకటిని చీల్చుకొని చూడటానికి ప్రయత్నించినది.

"అమ్మా: అప్పుడే లేచినారు! ఎంత ప్రొద్దుట లేచి పని చేసుకొని పోదామన్నా మేలుక రాదు."

"ఇప్పుడు తెల్లారి పోయినట్టు బాధ పడతా వేమిటి? గంట నాలుగున్నరే అయింది,"

"గంతేనా? అప్పుడే లేచి ఏం జేస్తవు మీ అత్త పందిరి గుంజకు పని జెప్తదిలే రాత్రంతా జేసినా తరగదు పని" చీకటి లోనే మూతి తిప్పుకుంది నరసమ్మ.

"నోరు దురదగా ఉందా యేమిటి నరసమ్మా?" చిన్నగా నవ్వుకుంది సుశీల.

"మీ అత్త నోటి దురద వదలగొట్టాలని ఉంది సుశీలమ్మా, ఆ చీపురు ఇటు ఇయ్యి. ఈళ్లెంతకు తలుపు తియ్యరు."

"యెందుకులే" మొహమాట పడింది సుశీల. నర్సమ్మ చనువుగా చీపురు లాక్కొని, రెంటళ్ళ వాకిలి చిమ్మింది. సుశీల వెళ్ళి బకెట్‌తో నీళ్ళు తెచ్చింది. నర్సమ్మ నీళ్ళు చిమ్మి, మరోసారి పక్కయింటి తలుపు గట్టిగా బాదింది. సుశీల ఇంట్లోకెళ్ళి అంట్లపని పూర్తిజేసి, వంటిల్లు శుభ్రం జేసి, కాఫీకి నీళ్ళు పెట్టింది. కాలకృత్యాలు స్నానం ముగించేసరికి చీకటి పలుచబారింది. ముగ్గు డబ్బా తీసుకుని బయటికి వెళ్ళింది. యెదురింటి కిటికీ లోంచి సుశీలనే చూస్తున్నాడో పురుష పుంగవుడు. నోట్లో బారెడు పందుం పుల్ల ఉన్నది. ముఖం తిప్పుకుని తొందరగా ముగ్గు పెట్టింది. అదే చేత్తో తులసి కోట చుట్టూ ముగ్గుపెట్టి, చెంబెడు నీళ్ళు పోసి నమస్కరించింది

"....యెక్కడా అలికిడే లేదు. మహారాణిగారు లేపనట్టున్నది. అదెందుకు లేస్తుంది? అమ్మ .. హూ! ఈ మేడ మెట్లొకటి నా ప్రాణానికి, అయ్యో! రాత్రి తిన్నదంతా ఈ మెట్లు ఎక్కేసరికే అరిగి పోతుంది. ఈ కొంప సత్రమై పోయింది. పని జేసే దిక్కు లేకపోయినా, మూడు పూటలా మెక్కేవారికేం కరువు లేదు. అమ్మా! అయ్యో! మళ్ళి ఏమొచ్చిందే సుశీలమ్మా?" ఆయాసపడుతూ మేడ దిగింది కనక దుర్గమ్మ. ఆమె అరుపులు, పిలుపులు సుశీలకు వినిపించవు. పెరడులో ఓ మూల బాగా యెదిగిన తోటకూర కోస్తున్నది సుశీల.

"ఏమిటే ప్రొద్దున్నే! నోరు దురదగా ఉంచే ఏ వెంకటేశ్వర సుప్రభాతమో చదువరాదూ?"

జవాబు చెప్పక ఆశ్చర్యంగా లోపల గది వైపు నడచింది కనక దుర్గమ్మ. ఉమా పతి మంచము మీద దొర్లుతున్నాడు· "మీ రెప్పు డొచ్చారు? పైకి రావడానికి అంత బద్ధక మేసిందా?" ఉరిమినట్టే అడిగింది.

"రాత్రి పన్నెండు దాటింది. మంచి నిద్రలో వుంటావని లేపలేదు. మూడు, నాల్గు రోజుల నుండి నిద్ర లేదు. పడు కొని నిద్ర బోయాను. ఇప్పుడే మయింది? లేవగానే నీ దర్శన మయిందిగా?"

"నా దర్శన మయినందుకు బాధగా ఉందా?" ఉక్రోషంగా అడిగింది.

"రామ రామ! అంత మాటనగలనా? ఏదో సరదా కన్నాను! టిఫిన్ ఏం చేయ మని పురమాయించావు? బొంబాయిలో చపాతీలు తినలేక గిల గిల లాడాననుకో" ఆమెను ప్రసన్నం చేసుకునే ధోరణిలో అడిగాడు, నవ్వబోయి మూతి ముడుచు కుంది అక్కడే వున్న కుర్చీలో చతికిల బడింది 'ఏం చేస్తుందో ఆ రాణిగారిని అడగాలి. రాత్రి తల నొప్పిగా ఉండి తొందరగా నిద్ర పోయాను, దానికెంత పొగరో వచ్చి అడగనయినా లేదు, అన్నీ ఆ అమ్మ బుద్ధులే: యెన్ని ఒగలు నేర్వక పోతే బంగారములాంటి నా తమ్ముడిని వలలో వేసుకుంటుంది? ఒట్టి వెర్రి సన్యాసి! ఇప్పుడేయో ఈ గుది బండను నా మెడకు తగిలించారు. అచ్చు అమ్మ కులికినట్లే కులుకుతుంది. మీరేమో విన యముగల పిల్ల అనుకుంటారాయే...."

ఆమె మాట పూర్తిగాక ముందే సుశీల వచ్చింది: "అత్తయ్యా! స్నానానికి నీళ్ళు న్నాయి: కాఫీ కలిపాను."

"గొప్ప పని చేశావు. టిఫిన్ చేస్తావా లేదా?"

"మామయ్య వచ్చారని ఇడ్లికి సిద్ధం చేశాను. కారపు పొడి కూడా కొట్టాను."

ఉమాపతి నోరూరింది. కనకదుర్గమ్మ కంఠయిన లేచింది. "యెవడి నడిగి చేశావ్? నీకు పెత్తనాలు ఎక్కువవుతున్నాయి: మామయ్యను మాయ చెయ్యాలని యెత్తు. మాయలమారిదాన! ఆ అమ్మ బుద్ధులే వచ్చాయి. కాఫీ కలిపిందట. కలిపి రెండు గ్లాసులు పట్టించలేకపోయావు? ఇదంతా నా రాత! ఒక్కగా నొక్క తమ్ముడని చదువు సంధ్యలు చెప్పించి పెద్దవాడిని చేశాను పెళ్ళి జేసి ముచ్చటా, అచ్చటా తీర్చుకుందామని మురిసి పోయాను నా మురిపెము ముక్కలుగాను యెక్కడి నుండి వచ్చిందో, యినుప గజ్జెల తల్లి, ప్రేమట, పెళ్ళట...." తను యెదురుగా ఉంటే గంటలు గంటలు వుపన్యాసం సాగి పోయే ప్రమాద ముందని అటునుండి వెళ్ళిపోయింది సుశీల.

"చూశారా దాని పొగరు! కాఫీ అయింది అన్నది. నేను ముఖం కడుగ లేదని తెలుసుగదా? బ్రష్షు, పేస్టు తెచ్చిం దేమో చూడండి. దేవుడో! ఈ పని, ఈ మనుషులతో వేగలేను. నాకీ చెర యెప్పుడు తప్పిస్తావో వెంకటరమణ

మూ_ర్తీ...." రెండు చేతులు జోడిస్తూ భ_ర్త వంక చూచింది. అతను నవ్వుతు న్నాడు. అతని వంక చుర చుర చూచింది "యెందుకా నవ్వు?"

"కనకం! అంటే కోపంగాని, నువ్వె ప్పుడయినా పని చేశావుటే? నీ అదృష్టం బాగుండి నువ్వు కాపరానికి రావటం తల చెడి మా అక్క యిల్లు చేరటం రెండు ఒకేసారి జరిగాయి. అమె ఉన్నన్నిరోజులు ఇటు పుడక అటు పెట్టనిచ్చిందా? ఆమెను ఆసుపత్రిలో చేర్చగానే మీ మరదలు వచ్చింది, చార్జి పుచ్చుకుంది. మరదలు పోగానే మా పిన్ని మూటతో వచ్చి చేరి, అంతా మనకే యిచ్చింది. ఆమె మరణిం చక ముందే సుశీల అంది వచ్చేను. ఇక నువ్వు పని చెయ్యవల్సిన రోజులు ముందు న్నాయే. సుశీల పెళ్ళయిపోతే " ఆమె విసురుగా లేచి వెరటి వైపుకు వెళ్ళింది.

ఉమాపతి కనకదుర్గమ్మ యెడ ముఖంగా, పెడముఖంగా ఫలహారం పూర్తి చేశారు అప్పడే ఇంట్లోని జనము ఒక్కొక్కరే లేవటం ప్రారంభించారు.

'సుశీలా! నా బ్రష్షు కనిపించటంలేదు కా_స్త వెదికి పెడుదూ!" ఒకరి పిలుపు:

"సుశీలా! నా ముఖం కడగటం అయింది కా_స్త వేడి వేడి పానీయం పట్రా ' ఇంకొకరి అజ్ఞ.

'ఏయ్! యెక్కడ చచ్చావు? నన్నీ రోజు ఆరు గంటలకే లేపమని చెప్ప లేదూ?" జ్యేష్టపుత్రిక హూంకరింపు

"రాత్రి నా ఓణికి ఇస్త్రరి పెట్టమ న్నాను పెట్టావా?" రెండో కూతురి అరా

"సుశీలక్కా! పండ్లపొడి సీసా అంది వ్వవూ?" చిన్నవాడి అర్థింపు.

"నాకు పాలు మొదట ఇవ్వవా..." అందరికంటే చిన్నదాని గునుపు. ఇవేవి వినిపించకుండా ఉండాలని గదిలో తలు పులు వేసుకుని కొప్పు విప్పుకుని కూర్చుంది కనకదుర్గమ్మ ఉమాపతిని హాల్లో చూచి చిన్న పిల్లలుకాస్త తగ్గారు.

'మీ రెప్పుడొచ్చారు డాడీ?" పెద్ద మ్మాయి ప్రసన్న అడిగింది! పేరుప్రసన్న అయినా, యెప్పుడూ అప్రసన్నంగానే వుంటుంది.

"రాత్రి వచ్చాను ప్రొద్దుటే యెనన్ని దావగొడుతున్నావమ్మా?" ఉమాపతి నెమ్మ దిగా అడిగాడు.

"మరే డాడీ! ఈ సుశీలకు బొ_త్తిగా భయం లేదు నేను ప్రొద్దుటే చంద్రం వాళ్ళ భావను రిసీవ్ చేసుకోవడానికి స్టేషన్‌కి వెళ్ళాల్సింది. లేపమంటే లేపనే లేదు చూడు" ముద్దుగా పలకబోయి మొద్దుగా పలికింది ప్రసన్న,

"చూడు ప్రసన్నా! సుశీల నీలాంటి పిల్లేగా! రాత్రి పడుకునేవరకు చాకిరి చేసిందా? అలా మేను వాల్చిందో లేదో నేను పిలిచాను. లేచి తలుపు తీసి పాలు వెచ్చబెట్టి యిచ్చింది. ఈ గొడవలో మరిచిపోయి వుంటుంది. పెద్దదానవవుతు న్నావు. అణుకువ నేర్చుకోకపోతే యెలా 'గమ్మా?"

"పో డాడీ! యెప్పుడూ ఆ పిల్లను సమర్థిస్తారు" మూతి తిప్పుకుంది.

"ఊం, నేను చెప్పితే నీ కర్థం కాదు. కాఫి త్రాగి నా గదిలోకి రా మాట్లాడాలి" ఉమాపతి నిట్టూర్చి తన గదిలోకి వెళ్ళి పోయాడు.

అరగంట గడిచాక ప్రసన్న, కనక దుర్గమ్మ ఇద్దరూ వచ్చారు గదిలోకి.ఇద్దరూ మౌనంగా కూర్చున్నారు, ఉమాపతి కూడా లేచి వారి కెదురుగా కూర్చున్నాడు.

"ప్రసన్నా! ఈ సంవత్సరము నీ వివాహం చెయ్యాలని వుందమ్మా. దారిలో పాత స్నేహితుడు కలిశాడు. ఆతనిద్వారా ఓ సంబంధము చూచి వచ్చాము. మీతో చెప్పి పెళ్ళి చూపులకు రమ్మని రాస్తాను"

"ఏమిటేమిటీ? నాతో ఒక్క మాట అనలేదేం? అంత దాపరికం ఏమొచ్చిందీ?

"కనకం! ఇప్పుడేమయింది? నువ్వు లేస్తూనే ఏదో గొడవతో లేస్తావు చెప్పే అవకాశ మేది?"

"మీరు ఈ ముక్క మొదట చెప్పితే యేగొడవా వుండకపోను. అబ్బాయి ఏం చదివాడు? తెల్లగా పొడుగ్గా వుంటాడా? ఉన్నవారేనా?" ఆమె ముఖంలో ఆదుర్దా చెప్పనలవి కాదు.

"అబ్బాయి అందంగానే వున్నాడు. బి. కాం. పాసై వ్యాపారం చేస్తున్నాడు. అతనిది చాలా సరళ స్వభావంలాగే కనిపించింది. అమ్మాయి నచ్చితే కట్నం పట్టింపు అంతగా లేదుట."

"మరింకేం రాసెయ్యండి. కట్నం పట్టింపు లేనివాళ్ళు దొరకడం మాటలా?"

"అమ్మా! ఇప్పుడేం తొందర. నా బి. ఏ. పూర్తి అవనీ...." నసిగింది ప్రసన్న.

"బి. ఏ చేద్దువుగానిలే అప్పుడే ఇరవై రెండు దాటాయా? నీ వెనకాలే శని తయారవుతుంది." కూతురి మాటలను మధ్యలోనే వుంచి వేసిందామె. బొటన వేలుతో నేలనురాస్తూ కూర్చుంది ప్రసన్న. ఉమాపతి రెండు నిమిషాలు కూతుర్ని తేరి పార జూచారు. "చూడు ప్రసన్నా! బల వంతము లేదు. ఇది వివాహ విషయము. ఆలోచించి చెయ్యవల్సిన పని. నీ మన సులో మాట చెప్పు."

"అది కాది డాడీ...." చెప్ప లేక సిగ్గుతో తల వంచుకుంది

"సంశయము వద్దు. నీ అభిప్రాయము నిర్భయంగా చెప్పు...." ప్రోత్సహించాడు ఉమాపతి.

'నా ఫ్రెండ్సు....నేను కలిసి ఓ ఒప్పందము చేసుకున్నాము. డాక్టరు.... గాని.... ఇంజనీరు గాని.... కలక్టరు గాని అయితేనే పెళ్ళికి ఒప్పుకోవాలని....మరి వాళ్ళంత హేళన చేస్తారేమో డాడీ...."

ఉమాపతి పక్కున నవ్వాడు. "ఈ అద్దు మరీ బావుంది. పిచ్చిదానివి. పదవులు హోదాలు శాశ్వతం కాదమ్మా. ఇవాళ్ళ రేపు వెయ్యిరూపాయల జీతగాడు కూడా నెలాఖరున కట కటాలాడిపోతాడు. మన




వ్యాపారస్తుల పని చూడు. నెలకు ముప్పై రోజులు ఫస్టుతారీఖే. మీ అమ్మ చీరలు కొనడానికి యెప్పుడయినా వెనుకాడిందేమో అడుగు.'' నవ్వుతూ భార్య వంక చూచాడు.

"నన్నేదో అనందే మీకు తోచదు. మీ స్వంత డబ్బు ఖర్చు పెట్టినట్టు మాట్లాడుతారు.

"డబ్బు నీదయినా, శ్రమ నాది కాదా? ఆలోచించి ఓ నిర్ణయము చెప్పమ్మా. అబ్బాయి మాత్రం బహు యోగ్యుడు సాంప్రదాయము మంచిది.'' అని అటు నుండి లేచి వెళ్ళిపోయాడు. తల్లి, కూతుర్లు కాసేపు మౌనంగా గడిపి, వారు లేచి వెళ్ళారు

* * *

సాయంత్రము వంటపని ముగించి తులసికోటవద్ద దీపం ముట్టించాలని వచ్చింది సుశీల. ప్రక్కింటి మేడ మీది నుండి అనసూయ పిలిచింది. "సుశీ! సుశీ!'' సుశీల తలెత్తి చూచింది. ప్రసన్నంగా నవ్వింది సుశీల. ''పని అయిందా పిన్నీ?'' కాస్త గట్టిగా అడిగింది.

"నా పని యెప్పుడో అయింది. నీకే తెమలని పని ఉన్నట్టు కనిపిస్తుంది. ఒక్కసారి వచ్చిపో.''

"అలాగే పిన్నీ.'' ఇంట్లోకి వచ్చి షాప్ దగ్గరనుండి వచ్చిన ఇమామును

ఇంట్లో ఉండమని, పిల్లలకు లెక్కలు ఇచ్చి, ప్రక్క ఇంట్లోకి వెళ్ళింది. అనసూయ యెదురు వచ్చి భుజాల మీద చేతులు వేసింది. ఆమె ఆప్యాయతకు కరిగి పోయింది, "ఎందుకు పిన్నీ, ఈ దిక్కులేనిదంటే యింత అభిమానము?"

"సుశీ! దిక్కులేనివారెవరూ లేరమ్మా. ఈ ప్రపంచములో అందరికి దిక్కై ఆ సర్వేశ్వరు డున్నాడు."

"అన్నీ గమ్మత్తుగా అన్వయించు తావు. బాబాయి లేరా?" అనసూయకు దూరం జరుగుతూ.

"మీ బాబాయి ఉంటే నీకు పోటీ రారులె. యెందుకంత దూరం జరుగు తావు? మీ అత్త సకుటుంబ సపరివారంగా వెళ్ళింది యెక్కడికే?"

"రేపు ప్రసన్న వదినను చూడటానికి వరుడు వస్తున్నాడు. వదినకు చీరలు.... యింకేం కొంటారో?"

"వరుడు వారం రోజులుంటాడా?" వచ్చే నవ్వును బిగబట్టి అడిగింది అనసూయ.

"అదేమిటి పిన్నీ! అప్పుడే పదిహేను రోజు లెందుకుంటాడు?" అమాయకంగా అడిగింది.

"మరి లేకుంటే మీ వదినకు చీరలే లేవుటే?"

"ఓ అదా? డబ్బున్నవారు. ఏదో మిషన కొత్త దుస్తులు కొనాలి కదా."

"డబ్బున్న వారట డబ్బు! నోమనీ వారి బూరెలు నోచినవారు తినిరన్న సామెతుంది. మీ నాన్న అహోరాత్రాలు కష్టపడి వ్యాపారం వృద్ధిలోకితెచ్చి ఫలితం అనుభవించకనే చనిపోయాడు. ఆ అభిమానమన్నా వుందేమిటే మీ అత్తకు? నిన్నో వంటలక్కను చేసింది. దానిది గుండె కాదే గుండ్రాయి."

'మన రాత బాగలేనప్పుడు యెవర్ని అని ఏం లాభం పిన్నీ? యింతకీ ఎందుకు పిలిచావు?"

"అలు బోండా చేశానే. ఒక్కదానికి తినబుద్ధి కాలేదు. రా, రెండు తిందువు గాని." అలమరలోంచి ఆలుబోండాలు పళ్ళెంలోకి పెట్టింది. డబ్బా తీసి కోవా బిళ్ళలు కూడా పెట్టింది. ఇద్దరూ ఫలహారం చేశారు. సుశీల లేచింది. "వెళతాను పిన్నీ." అనసూయ చేయిపట్టి లాగి కూర్చో పెట్టింది.

"బజారుకు వెళ్ళిందంటే బజారంతా కొననిదే ఇల్లు చేరుతుందటే మీ అత్త! కూర్చో."

"అది కాదు పిన్నీ! ఇవాళ్ళ రేపు ప్రేమను వేణును కాపలా పెట్టింది. పూలు తెస్తానని చెప్పి వచ్చాను." భయంగా చూచింది. అనసూయ బయటికి వచ్చి కుండీలలోంచి గులాబీలు త్రుంచి యిచ్చింది. బాగా విచ్చిన పెద్ద పసుపు గులాబి తెంపి సుశీల జడలో తురిమింది. సుశీల పూలు తీసుకుని లేడిపిల్లలా పరుగెత్తినది. అనసూయ ఒక్కసారి సుశీల

తల్లి, తండ్రులను తలచుకుంది

రఘు కనకదుర్గ స్వయాన అక్కా, తమ్ముడు ఒక తల్లికడుపున పుట్టినవారు రఘు తండ్రి కూతురి వివాహం చేస్తూనే గుండె ఆగి మరణించాడు అల్లుడి పాద మహిమ అన్నారు అందరూ ఉమాపతి చేసే చిన్నపాటి ఉద్యోగం వదిలి, మామ చేసే కలప వ్యాపారం చేపట్టాడు రఘు రక్షకు డయినాడు కూడా తల్లి నీడలో, బావగారి సహాయంతో రఘు బి ఏ పూర్తి చేసి వ్యాపారంలో ప్రవేశించాడు కలప వ్యాపారంలో భాగస్తు డయిన కేశవయ్యకు ఒకే ఒక్క కూతురున్నది ఆమె పైనే కనకదుర్గమ్మ కళ్ళున్నాయి రఘు వివాహం చూడకనే తల్లి కండ్లు మూసింది కనకదుర్గమ్మ నిరంకుశత్వంగా గృహ రాజ్యాన్ని పాలించడం మొదలు పెట్టింది రఘు అహోరాత్రాలు కష్టపడి వ్యాపారాన్ని పదింతలు చేశాడు ఉమా పతి సలహాదారుడుగా ఉండి పోయాడు కనకదుర్గ ఆకాశానికి నిచ్చెనలు వేస్తుంటె, ఒకరోజు ఓ బీద అమ్మాయిని వెంటబెట్టు కుని వచ్చి 'నా భార్య అక్కా ఆశీర్వ దించు అన్నాడు రఘు కనకదుర్గమ్మ కోపం తారాపథం అంటినది తిట్టింది శాపనార్థాలు పెట్టింది నానా గల్లంతు చేసింది ఉమాపతి ఉపాయంగా శాంత పరిచాడు 'వ్యాపారమంతా రఘు చేతుల్లో ఉంది నా ఇష్టం మీరు పొండి' అంటే మనము వీధిలో నిలబడాలి నల్గురు పిల్లలు కూడా ఉన్నారు అతను యెవరిని చేసు కుంటే నీకేం?' అని యెంతో నచ్చ చెప్పాక తన కోపాన్ని దిగమ్రింగుకుంది అమాయకురా లయిన రఘు భార్య మీద ఆడబడుచు అధారిటీ చెలాయించడం మొదలు పెట్టింది రఘు భార్య జానకి సాధుస్వభావురాలు ఆడబడుచు ఆగడాలు భర్తకు యేనాడు చెప్పలేదు మారుటితల్లి బాధలు పెడుతుందంటే భరించలేక ఆత్మ హత్య బూనుకుంటే రఘు రక్షించి, రిజిష్ట రాఫీసులో వివాహం చేసుకుని తీసు కొచ్చాడు కష్టాలు భరించిన జానకికి ఆడబడుచు ఆరళ్లు అంతకష్టతరంగా అని పించలేదు భర్తలాలనలో సర్వం మరిచి పోయేది మరో సంవత్సరానికి సుశీల పుట్టింది జానకి కోరిన కోరికల్లా ఒకటే తన తల్లిపేరు కూతురుకు పెట్టుకుంటా నంది సహృదయుడైన రఘు అంగీక రించాడు తమ తల్లిపేరు పెట్టాలని కనక దుర్గమ్మ పేచి పెట్టింది తన మాటకు విలువ నివ్వని తమ్ముడంటే కక్ష పెంచు కుంది తన కోపం క్రక్కలేక మ్రింగ లేక అవస్తపడేది అప్పుడే కొత్తగా కాపు రానికి వచ్చిన ప్రక్కింటి ఇనస్పెక్టరుగారి భార్య అనసూయకు సుశీలంటే ప్రాణం జానకి అంటే గౌరవము రఘు అంటే భక్తి ఒక్కగా నొక్క పిల్లని, సుశీలను అల్లారు ముద్దుగా పెంచారా దంపతులు సుశీలకు పదేళ్ళు నిండక మునుపే ఇద్దరూ ఒకరి తరువాత ఒకరు మరణించారు

తమ్ముడి పైనా, మరదలిపైన పెంచుకున్న కసి సుశీల మీద తీర్చుకోసాగింది కనక దుర్గమ్మ. లోకం ఏమంటుందోనని సుశీలను బడికి పంపేది. ఇంటి పనులతో, అత్త దీవెనలతో ఆలసిపోయిన అమ్మాయి పాఠాలు ఏం చదువుతుంది? మెట్రిక్కులో తప్పింది. అదే మంచి అదను అని చదువు మాన్పించి, వంట ఇల్లు అప్పగించింది. వ్యాపారమంతా రఘు పేరు నుండేది. సుశీల తరపున అడిగే వారు లేరు. మెల్లగా అంతా ఉమాపతి పరం అయింది. స్వతహాగా ఉమాపతి అంత చెడ్డవాడు కాడు. కాని వ్యక్తిగా కొన్ని బలహీనత లున్నాయి. అతని బలహీనత కనిపెట్టి దెబ్బ తీస్తుంది కనక దుర్గమ్మ. వెంటనే లొంగిపోతాడు ఉమాపతి. సుశీలను తమ పెద్ద కొడుకు వెంకట్‌కు చేసుకుంటే రఘుకు అన్యాయం జరుగదు అతని ఆత్మ తృప్తి చెందుతుందని ఉమాపతి ఉద్దేశం. భార్య పడనిస్తుందా అన్నదే సమస్య!

ప్రసన్న అలంకారము ముగించి అద్దంలో తన ప్రతిబింబము చూచుకుని తృప్తిగా నిట్టూర్చింది. అంతకు ముందు రోజు కొన్న ధర్మవరము జరీ బుటీలున్న ముదురు గులాబి రంగు పట్టుచీర, అదే రంగులో సాదాపట్టు బ్లవుజు వేసుకుంది. మెడలో కెంపుల నెక్లెసు, చెవులకు

కెంపులు, ముత్యాలు కలిపిచేసిన జూకాలు, ఒక చేతికి వాటి మ్యాచ్ అయ్యే గాజు రెండో చేతికి రిస్టువాచి పెట్టుకుంది. పెద వులకు కనిపించీ, కనిపించనట్టు రంగు అద్దుకుంది కనకాంబరాలు మరువము కలిపిన మాల తీసుకు వచ్చింది సుశీల. మాలను తలలో తురుముకోబోయే అంతలో, ప్రసన్న స్నేహితురాలువచ్చింది "ప్రసూ! యెంత అందంగా ఉన్నావో తెలుసా? అందములో ఆ అపశ్రుతి యేమిటి? వద్దు ఆ కనకాంబరపు మాల పెట్టుకోవద్దు" వారించింది, ప్రసన్న, సుశీల ఇద్దరు తెల్లబోయి చూశారు. "నీ చీరకు మ్యాచ్ అయ్యే పువ్వులు పెట్టుకోవాలి యెరుపు గులాబీలు లేవా?"

"అలా నిలబడతావేమే! వెళ్లి అన సూయమ్మ నడిగి కోసుకురా" ప్రసన్న వక్కసారి ఉరిమి చూచింది సుశీలను. సుశీల వెళ్ళి పది నిమిషాల్లో గులాబి పువ్వులతో తిరిగి వచ్చింది ఇంట్లో అందరూ నీటుగా ముస్తాబయ్యారు ఇల్లంతా శుభ్రంగా సర్ది పెట్టింది సుశీల. రకరకాల ఫలహారాలు చేశారు వెంకట్, వేణు కారు తీసుకుని మెయిన్‌రోడ్డు మీదికి యెదురు వెళ్ళారు అనుకున్న సమయానికి పెళ్ళికుమారుడు, అతని తల్లి, మధ్యవర్తి వచ్చారు. బంగారపు వడ్డాణం సరి చేసుకుంటూ యెను రేగింది కనకదుర్గమ్మ వియ్యపురాలని చూచి నీరు గారిపోయింది. సాదా తెల్ల మల్లుచీర, చేతులకు బంగారపు కడియాలు తప్ప మరేంలేవు. పెళ్లి కొడుకు అందరికి నమస్కరించాడు. అతన్ని చూ అందరు తృప్తిగా నిట్టూర్చారు పచ్చ పసిమి ఛాయలో ఆరడుగుల యెత్త విగ్రహము నొక్కుల జుట్టు అతనిమూ విన నని యెగిరెగిరి పడుతున్నది బూడి రంగు సూటు ధరించి హుందాగా ఉన్నాడు అందరూ సోఫాలలో కూర్చున్నారు ఉమాపతి భార్య వంక చూశాడు అతని భావము గ్రహించి, ముసుగు సవరించు కుంటూ వంట ఇంటి వైపు వెళ్ళింది సుశీల ఫలహారాలు పళ్ళాలలో అమరుస్తుంది "ఏమే అయిందా?"

"అయినది మీరు తెమ్మన్నప్పుడు తెస్తాను" ప్లేట్లు పెద్ద పళ్లెంలోకి పెడుతూ.

"తెమ్మనే అంటున్నాను అవతలవాళ్లు వచ్చారు ఆ వెలిసిపోయిన చీరె తగుల బడినదా?'

"ఇదే చిరుగులు లేక గట్టిగా ఉంది." తన అసహాయతను వెళ్ళడించింది.

"నా రాత! నీతో పని, కుక్క తోక పట్టుకుని గోదావరి ఈదినట్టు ఉంది ఆ కొయ్యకున్న ఫుల్‌వాయిల్ చీర కట్టుకో. త్వరగా తెమిలి ఫలహారాలు పట్టుకురా. ఆ ఇమామ్ చెవిటివాడు. కాస్త నీళ్ళు పట్టుకు రమ్మను" ఆజ్ఞాపించి వెళ్ళి పోయింది కనకదుర్గమ్మ. అప్పటికే ప్రసన్న అమె స్నేహితురాలు వచ్చి కూర్చున్నారు. పరస్పర పరిచయం గావించాడు ఉమాపతి. ప్రసన్న సుతారంగా చేతులుజోడించి

నమస్కరించింది పెళ్ళికుమారుడు చిన్నగా నవ్వి తల పంకించాడు

"ఇద్దరూ విద్యావంతులే స్వతంత్ర ముగా మాట్లాడుకోవచ్చు' మధ్యవర్తి చలోక్తి విసిరానని తలిచాడు

"ఏం చదువుతున్నావమ్మా?' పెళ్ళి కుమారుని తల్లి అడిగింది

"బి ఏ రెండో సంవత్సరము' ముక్తసరిగా జవాబు చెప్పింది

'ఒక యేడు వెనకబడింది వదినగారూ పరీక్షలప్పుడే జ్వరము పట్టుకుంది పూర్తి చేస్తుంది మొన్ననేగా పద్దెనిమిదో యేడు వచ్చింది" కనకదుర్గమ్మ చెప్పింది పెళ్ళి కొడుకు తనలో తాను నవ్వుకున్నాడ మొన్న ఉమాపతి యిరవై రెండేళ్ళని చెప్పాడు. భారత స్త్రీలకు వయసు విష యంలో నిజం చెప్పే అలవాటు యెప్పు డొస్తుందో! అనుకున్నాడు

'ఏమయ్యా పెళ్ళి కొడకా అంత మౌనము మేస్తున్నావు?" మధ్యవర్తి ప్రశ్నించాడు

'మీరు మాట్లాడుతున్నారుగా?" అని తలెత్తాడు యెదురుగా బల్లపై పళ్ళాలు పెడుతుంది సుశీల నెమ్మదిగా అతి నెమ్మ దిగా ప్రక్కవారికి అంతరాయం కలుగు తుందేమో అన్నంత నెమ్మదిగా పెడు తుంది సన్నగా, పీలగా పొడుగ్గా వుంది పొడుగాటి జడ భుజంమీదుగా ఒకప్రక్కకు జారి భూదేవిని ముట్టుకోవాలని ప్రయత్ని స్తుంది వంగి ఉండటం చేత పచ్చని నుదురు, సగం బొట్టు మాత్రం కని పించాయి అప్రయత్నంగా చేతిలోని రుమాలు జారవిడిచాడు అది సుశీలపాదాల వద్ద పడింది ఆమె కంగారుగా తలెత్తింది. అప్పుడే పెళ్ళికుమారుని కళ్ళు ఆమెను తరిచి చూస్తున్నాయి రెండు క్షణాలు ఆ చూపులతో చూపులు కలిపింది విశాలమైన సోగకళ్ళల్లో ఏమాకర్షణ కనిపెట్టాడోగాని ఆ యువకుడు తృప్తిగా నవ్వాడు తన్ను తాను సంభాళించుకోవడానికి లోపలికి వెళ్ళి పోయింది

అందరికి ఇవ్వవే" కనకదుర్గమ్మ కర్కశంగా వినిపించింది

'యెవరండి ఆ అమ్మాయి?" కుతూ హలంగా అడిగింది వరుని తల్లి

"యెవరో దిక్కులేనిది దయదలచి పెంచాను '

అలా అంటారేమండి కనకదుర్గమ్మా మీ రఘు కూతురు కదూ?' మధ్యవర్తి ఆశ్చర్యంగా చూచాడు

'ఆం కూతురే కులం తలం లేని దాన్ని తెచ్చాడు దానికో ఎల్లపుడితే రఘు కూతురయిందా? పిల్లలు గలదాన్ని ఇవన్ని యెలా బయట పెట్టుకుంటాను?" ఆమె ముఖం మాడిపోయింది

"ఇవ్వాళ్ళ రేపు యింకా కులాలేమిటి లెండి మంచీ చెడు, రెండే కులాలుగాని" వరుడు పలికాడు

"అంతా మీలా అనుకుంటారా బాబూ! యెప్పుడూ గుండెలలో కుంపటి మోస్తూ

తిరుగుతున్నాను మా గొడవలకేం ఫల హారం తీసుకోబాబూ ''

'ఇంతకు రఘు యెవరండీ?'' వరుని మేనమామ అడిగాడు

''స్వయాన దుర్గమ్మగారి తమ్ముడు. పాపం గుండెజబ్బుతో పోయాడు '' మధ్య వర్తి జవాబు

''అట్లాగా?'' మేనమామ తల పంకించారు ఇంటివారికీ సంభాషణ ఏం నచ్చ లేదు ''ఫలహారం తీసుకోండి'' అందరూ ఫలహారాలు స్వీకరించారు వాతావరణం తేలిక చెయ్యడానికి మధ్యవర్తి అక్కడివి, యిక్కడివి పెళ్ళి కబుర్లు చెప్తున్నాడు అందరూ వింటున్నారు మధ్య మధ్య ఉమాపతి మాట కలుపుతున్నాడు వరుని కళ్ళుమాత్రం పదే, పదే సుశీల కోసం చూస్తున్నాయి అది గ్రహించినట్టు, సుశీల కాఫీలు ఇమామ్‌కిచ్చి పంపింది 'పంచ దార'' నెమ్మదిగా చెప్పాడు వరుడు ఇమామ్ డ్రస్సింగ్ రూమ్‌లోకెళ్ళి చలువ చేసిన పంచ పట్టుకొచ్చి పెళ్ళికుమారుని కియ్యబోయాడు

''ఏమిటిరా అది?'' ఉమాపతి అడిగాడు గట్టిగా

''అయ్యగారు పంచె తెమ్మన్నారు '' నింపాదిగా వచ్చింది జవాబు

''పంచెకాదురా చెవిటిలోకమా! పంచ దార'' వెంకట్ అరిచాడు చిన్నపిల్లలు గొల్లున నవ్వారు

''సుశీలా! కాఫీతోపాటు పంచదార పెట్టాలని తెలియదూ?'' దుర్గమ్మ హుంకరించింది

''పెట్టానత్తయ్యా'' తీయగా సన్నగా మధురముగా వినిపించింది వరునిచెవులకు, పళ్లెంలోఉన్న చిన్న వెండిగిన్నెపై మూత తీసింది వరుని తల్లి 'సారీ' నేను చూచుకో లేదు ' అన్నాడు వరుడు నవ్వుతూ అతడు ఆత్రంగా లోపలి వైపు చూచాడు సుశీల వస్తున్న జాడలేం కనిపించలేదు అతని చూపుల భావం పసికట్టింది కనకదుర్గమ్మ 'వెంకట్! అబ్బాయికి మేడ చూపించు నువ్వూ వెళ్ళవే ప్రసన్నా! యింకా పాత కాలపు పెళ్లి కూతురల్లే సిగ్గుపడతావేం?'' నవ్వుతూ చెప్పింది ముగ్గురూ, వారి వెన కాల ప్రసన్న స్నేహితురాలు పైకివెళ్ళారు వెంకట్ కూడా తల్లిలా అతితెలివి చూపించ బోయాడు 'బావా! ఇది నా గది ఈ టేప్ రికార్డరు స్టేట్స్‌నుండి తెప్పించాను ట్రాన్సిస్టర్ లండన్ నుండి నా స్నేహి తుడు పంపించాడు ఈ శిల్పమేమో మా ప్రొఫెసరు సిలోన్ నుండి తెచ్చియిచ్చాడు

'బావున్నాయి ఆ పైంటింగ్స్ మీరు వేశారా? '

''మనకంత ఓపిక లేదండోయ్ కల కత్తా వెళ్ళినప్పుడు శాంతినికేతన్ నుండి కొనితెచ్చాను ''

''క్రికెటు, సినిమా గురించి మాట్లాడ మనండి గంటల తరబడి మాట్లాడుతాడు'' ప్రసన్న కలుగజేసుకున్నది చిన్నగా నవ్వాడు వరుడు ''రండి నాగది చూద్దురు




గాని'' అందరూ ప్రసన్న గదిలోకి వెళ్ళారు ప్యాన్ ఆన్ చేసింది బల్లపైన అన్నిరకాల ఇంగ్లీష్ నవలలున్నాయి అతను వాటి వంక చూడగానే ప్రసన్నముఖం వికసించింది. "అన్నీ ఇంగ్లీష్ నవలలేనండి. నాకివి అంటే ఇష్టం మనవారు రాస్తారు యెందుకూ చెత్త బోర్'' అన్నది.

"మన వారివి అంటే తెలుగువారివి యెవరివి చదివారు?''

''యెవరివో లెద్దురూ! వాటిని చదవడమే బోర్ అంటే యెవడు జ్ఞాపకం పెట్టుకుంటాడు?''

ఆ ఇంగ్లీష్ నవలలు కూడా చదివిందా అనే అనుమానమొచ్చింది అతనికి. తమ భాషలో రుచిలేని వారికి ఇతర భాషలలో రుచి ఉందంటే అంతగా నమ్మదగిన విషయముకాదు ఒకవేళ వారు ఉత్సాహము చూపినా అది ఇతరుల కన్ను గప్పడానికి నటిస్తారు తమను, తమ భాషను, తమ సాహిత్యాన్ని చులకన చేసుకోవడం ఆంధ్రుల అభిమాన విషయము. "ఏమిటి ఆలోచిస్తున్నారు''

"ఏం లేదు. మీ అదృష్టానికి అసూయ కలుగుతుంది నాకు చదువాలని అభిలాష ఉన్నా సమయము దొరకదు యెప్పుడూ ఏవో పనులుంటాయి'' లేచి కిటికీదగ్గరకు నడిచాడు. అతని ముఖం వికసించింది. పంపుదగ్గర నిలబడి పళ్ళాలు తుడుస్తుంది

సుశీల. ఈసారి ఆమె ఆకారాన్ని పూర్తిగా తిలకించాడు. చిత్రకారుని చిత్రములా ఉంది ఇమామ్ ఏదో చెప్పాడు. పక్కున నవ్వింది. ముత్యాల వరుసలా పలువరస బయటపడింది ముగ్ధుడై చూసాడు

"ఏమిటి చూస్తున్నారు?" వెనుకనుండి ప్రసన్న అడిగింది.

"ఏం లేదు, మీ తోట చాలా బాగా పెంచారు."

"మాలి ఉండగా యింకా బావుండేది. సుశీల చేతికి వచ్చింది సగం మొక్కలు పోయాయి."




"రండి బావగారూ! మాతోట చూద్దురు గాని" వెంకట్ వచ్చాడు.

"వద్దు సాయంత్రం ఒకచోటికి వెళ్ళాలి త్వరగా మెట్లు దిగి వచ్చాడు. అతని వెను కాలే అందరూ వచ్చారు. హాల్లో కనక దుర్గమ్మ కంఠము కంచులా మ్రోగుతుంది. "అది సంగతి వదినగారూ. ఓ డాక్టరు చదివే అబ్బాయి అయితే కానీ కట్నం వద్దు అమ్మాయినిస్తే చాలు అన్నాడు. మాకు నచ్చలేదు అబ్బాయి నల్లని నలుపు. ఇంకో ఇంజనీరు ఒక బేపోరు పెట్టాడు. పెళ్ళికాగానే యిద్దరము అమెరికా వెళ్తా మని చెప్పాడు. అమ్మాయికి అతడు నచ్చ లేదు. ఈసారి అందరికి నచ్చాడు అబ్బాయి. మీ అభిప్రాయం కూడా చెప్పితే శుభం అనుకుందాము కట్నకానుకల విషయం కూడా సెలవిస్తే" ..

"అంత తొందర పడితే యెలా కనకం? వారు యింటికెళ్ళి మంచీచెడు ఆలోచించ వద్దు."

"ఆలోచించే చెప్పమంటున్నానులెండి" అన్నది భర్తను నిరసనగా చూస్తూ.

"మనము కలువాలని ఉంటే కలు స్తామా? అతని యిష్టమెలా ఉందో? రాసి పెట్టి ఉంటే తప్పించుకోలేము. కదా? అబ్బాయితో మాట్లాడి ఉత్తరం రాస్తాము. లేవన్నయ్యా అబ్బాయి యెక్కడికో వెళ్ళా లని అన్నాడు" అందరూ లేచారు. పర స్పరం నమస్కరించుకుని, సెలవు తీసు కున్నారు. వరుడు తనకు ప్రత్యేకంగా వెళ్లి

వస్తానని చెప్తాడేమోనని ప్రశన్న ఆశగా చూచింది. అతను అందరికి ఒకేసారి నమస్కరించి కారులో కూర్చున్నాడు. అందరూ యెక్కగానే కారు కదలింది. "యెదురు చూస్తుంటాం వదినగారూ" అన్న మాటలు కార్ల రొదలో కలిసి పోయాయి

"ఏం పిన్నిగారూ అంతా అయినట్టే మాట్లాడుతున్నారు ప్రసన్న అభిప్రాయం అడిగారా?"

"అయ్యో తల్లీ! కుంటివాడికిస్తున్నామా గుడ్డివాడికా? దానికిమాత్రం యెందుకిష్ట ముండదూ?" కనకదుర్గమ్మ ప్రసన్నవంక చూచింది. ప్రసన్న స్నేహితురాలివంక నవ్వుతూ చూచింది. "అల్లుడు కుంటి. గుడ్డికాదుకాని. కాస్త పొగరుమోతురకంగా కనిపించాడు"

"అది సహజమే కదా అందం చందం డబ్బు, దస్కం ఉన్నాయి.

"అమ్మా! చందము మాకు కనిపించ లేదు కదే? దస్కం అంటే ఏమిటమ్మా?" వేణు అడిగాడు అమాయకంగా. కసరి కొట్టింది తల్లి. పుస్తకాలు ఊపుకుంటూ శశి వచ్చింది "రా శశీ! కాబోయే బావ గార్ని చూడనోచుకోలేదు" వెక్కిరించాడు వెంకట్. శశి అపనమ్మకంగా యింట్లోకి చూచి ముఖం కందగడ్డలా చేసుకుంది.

"అదేమిటమ్మా? అప్పుడే వెళ్ళి పోయారా?రాత్రికిభోజనాలకు ఉండమంటా నన్నావుకదే?" అన్నది ఏడుపుముఖంతో,

"అన్నానే తల్లీ. అడదానికి నా కెంత ఉత్సాహముంటే యెందుకు? మొగ మహా రాజు మీ నాన్న, వారిని ఉండమని ఒక్క మాట అనందే" భర్త వంక రుస రుసా చూపులు విసిరింది.

"ఇప్పుడేముంది? నచ్చితే త్వరలోనే తెలుపుతారు. అందరం వెళ్ళి చూడొచ్చు." ఉమాపతి ఎగురగొట్టాడు మాటల్ని.

"నచ్చితే అని దీర్ఘం తీస్తున్నారు.... నచ్చలేదని చెప్పారేమిటి?"

"నీకు నచ్చిందని ఎప్పుడు చెప్పారే?" ఆశ్చర్యం నటించాడు ఉమాపతి.

"వేరే చెప్పాలేమిటి? వారు మాట్లాడిన

# చూడండి, మీకే తెలుస్తుంది...

# సర్వోత్తమ తెలుపుకోసం టినోపాల్ !

ఫలితములను చూడండి, బట్టలను ఆఖరు సారి జాడించునపుడు కొంచెము టినోపాల్ వేయండి, అప్పుడు చూడండి బట్టలు ఎంత తెల్లగా కళ్లు మిరుమిట్లుగొలిపేలా ఉన్నాయో! టినోపాల్ ఎంత తెల్లగా చేస్తుంది! మీ చొక్కాలు చీరలు దుప్పట్లు తువాళ్లు మొదలైనవి మెరుస్తూ ఉంటాయి! దానికయే ఖర్చు? బట్టకు ఒక పైసా కూడ కాదు! టినోపాల్ను కొనండి రెగ్యులర్ ప్యాక్ మితవ్యయ ప్యాక్ మరియు బాల్చీకి సరిపోయే పొట్లము—మూడు ప్యాకింగులలో లభిస్తోంది.






® టినోపాల్ జె.ఆర్ గైగి ఎస్ ఎ బాల్
స్విట్జర్లెండ్ వారి రెజిస్టర్డ్ ట్రేడ్ మార్కు

సుహృద్ గైగి లిమిటెడ్
పి ఒ బాక్స్ 11050 బొంబాయి 20 బి ఆర్

Shilpi HPMA 12A/70 Tel

తీరు, ముఖ లక్షణాలనుబట్టి ఆ మాత్రం గ్రహించలేమా? మన ప్రసు నచ్చలే దన టానికి అతడేం అవివేకి కాదు. మీరు లేని పోని అనుమానాలు పెట్టుకోకండి ''

"అందుకే పిన్నీ వీళ్ళిద్దరికి ఏకాంతము కలగజేసి నేను, వెంకట్ బయటనే ఉండి పోయాము బాగానే మాట్లాడినాడు మరేం మాట్లాడినాడోగాని '' ప్రసన్న స్నేహి తురాలు తన తెలివితేటలు వెళ్ళడించు కుంది దుర్గమ్మ ముఖం చాటంత ఐంది. దగ్గరగా వచ్చి కూతురితో గుస, గుస లాడింది

"ఏమన్నాడే ? చాకులా ఉన్నాడు అబ్బాయి నా దగ్గర దాపరికం దేనితే చెప్పవే?"

"ఏం లేదు పుస్తకాల గురించి అడిగా రమ్మా. నేను ఇంగ్లీషువే తప్ప చదువ నన్నాను '' సిగ్గుపడుతూ చెప్పింది ప్రసన్న

'ఏమిటే అక్కా?' అంటూ శశి వచ్చింది విశేషాలు రాత్రంతా మాట్లాడినా తరగలేదు. అందరూ సంతోషాలలో తేలి యాడుతూ భోజనం కూడా సరిగ్గా చేయ లేదు.

"మొదటి పెండ్లి ఘనంగా చేయా లండీ. వాళ్ళు కట్నం యెక్కువ అడక్క పోతే అమ్మాయికో రవ్వల నెక్లెసు చేయించాలండీ. అల్లాటప్పా అను కునేరు."

"అమ్మా! ఒరి నెక్లెసు వద్దే. చేయిస్తే, పెట్టు చేయించండి." ప్రసన్న ముద్దుగా గుణిసింది.

"పెట్టు అంటే మాటలా? చూద్దాములే ఏమండోయ్! వాళ్ళ దగ్గర బెల్లం కొట్టిన రాయిలా కూర్చోకండి. అమ్మాయి దుస్తుల క్రింద మూడు వేలన్నా అడగాలి. వింటు న్నారా? ఇదెక్కడి మనిషమ్మా కూర్చునే నిద్రపోతారు! ఈయనలో ఇదే చిక్కు వెంకట్ నువ్వైనా పెళ్ళి అయ్యే వరక నామాట వినరా శశి నువ్వూ, చిన్నారి వస్తాడు శుభలేఖలు పంచిపెట్టే పని తీసు కోండి ఒసేయి సుశీలా! యెక్కడ చచ్చి నావే? కానికి కొరగాని మనుషులమ్మా. అన్నం సరిగ్గా తినలేదు పాలు యివ్వాలని తెలియదుటే? వంటింటికీ దీనికి సరిపో తుంది '' దుర్గమ్మ మాట పూర్తి అవ కుండానే సుశీల పాలగ్లాసు తెచ్చి బల్లమీద పెట్టింది. సుశీల వంక యెగా, దిగా చూచింది "చీర మార్చుకుంటే ఏం రోగమే. సీదనుకున్నావా, నీ అమ్మదా ? ఫుల్‌వాయిల్ చీరలంటే ఏమనుకున్నావు? నలభై దాటాయి. మా కాలంలో నలభై పెడితే మాంచి బెనారసు చీర వచ్చేది. దిక్కులేనిదని దయతలిస్తే నా నెత్తిన యెక్కుతున్నావు. నీ మూలాన వాళ్ళ ముందు తల వంచుకోవాల్సి వచ్చింది. యెవరొచ్చినా ముందు టింగు, రంగా అంటూ వస్తావు ''

"మీరె రమ్మన్నారు కదా అత్తయ్యా. నేను ఇమామ్‌తో వస్తానని అన

లేదూ?''

"అన్నావు లెదూ. ఒక్క నిమిషంలో చెవిటి వెధవ యెంత పని చేశాడు!" వా డిదివరకు చేసినవి, ఈ రోజు చేసినవి, అవక తవక పనులు చెప్పుకుని ఒకటే నవ్వారు అందరు. వచ్చే కన్నీరు నాపు కుంటూ లోపలికి సుశీల వచ్చింది. 'నా అమ్మ చీరకట్టే ఎంత ధీమాగా మాట్లాడు తుంది?' అనుకుంది. ఆ రోజు దుర్గమ్మ కట్టినచీర రఘు కాంజీవరంనుండి తేవడం భార్య కివ్వడం బాగా గుర్తుంది సుశీలకి. అప్పుడు ఆ మెకు తొమ్మిదేండ్లు. 'విధి బలీయం దీన్నే అంటారు కాబోలు' అనుకుంది.

పదిరోజులు గడిచాయి మరోసారి వెళ్ళిరమ్మని దుర్గమ్మ పోరుతున్నా ఉమా పతి జాప్యం చేస్తున్నాడు. పదకొండవ రోజునాడు మధ్యవర్తి నుండి ఉత్తరం వచ్చింది ఉమాపతి ఆత్రంగా విప్పి చది వాడు

"ఏం రాశారండీ? ఒప్పుకున్నట్టేనా?" కనకదుర్గమ్మ ఆత్రంగా ప్రశ్నించింది

"ఉహూఁ" నాన్నాడ. అతని నాన్చుడు చూస్తే ఆమెకు పట్టరాని కోపం వస్తుంది ఉత్తరం లాక్కొని అసహాయంగా చూచింది అది ఇంగ్లీషులో వ్రాయబడి ఉంది. "ఉహూ అంటే అర్థం ఏమిటండీ?"

"ఏముంది! వారికి మన అమ్మాయి నచ్చలేదంటా, సుశీలను యిస్తే కట్నంతో పనిలేదట."

"ఏమిటి? మతుందే రాశారా? అష్ట దరిద్రులు! నా బిడ్డ నచ్చలేదూ? కులం గోత్రం లేక నా యింట కూటికి పడిఉన్న దరిద్రురాలు నచ్చిందా?" చిందులుత్రొక్క సాగింది దుర్గమ్మ

"గొడవ యెందుకు? యెన్నో సంబం ధాలు అనుకుంటాము. అనుకున్నవన్నీ అవుతాయా? మన గొడవలతో పిల్లలు చిన్నబుచ్చుకుంటారు' ఉత్తరం లాక్కొని జేబులో పెట్టుకున్నాడు

"మీ రు యింత మెత్తనివారనే అందరు అలా చులకన చేస్తారు అంత నచ్చని మొనగాడు మన అమ్మాయితో ఏకాంత ముగా యెందుకు మాట్లాడాలి? వెళ్ళి నాల్గు దులిపిరాండి"

"కనకం! నీ ఆవేశం నీదేనా? నామాట వినవా? అతను ఏకాంతము కల్పించమని నిన్ను కోరినాడా? నీ కూతురి స్నేహితు రాలు తనో గొప్ప నాగరికురాలననుకొని అతన్ని ఒంటరిగా విడిస్తే ఏం చేస్తాడు? ఆడపిల్లలకు లేని అణకువ మగవాడి కెందుకుంటుంది సంబంధం కుదిరేవరకు హద్దుల్లో ఉండాలే అంటాను వింటావూ? మనపిల్లలే పెద్ద చదువులు చదివినట్టు చేస్తావు" అతని మాటలు కటువుగా ఉన్నాయి మరేం మాట్లాడలేదు. రాత్రి భోజనాల వద్ద వెంకట్ పెళ్ళివారి విషయం యెత్తాడు ఉత్తరం సంగతులు చెప్పక, తమకిష్టం లేదన్నట్టు తేల్చింది దుర్గమ్మ. "ఎర్రగా, బుర్రగా ఉన్నాడని మోజు




ద్దాముగాని వారి సాంప్రదాయం నాకేం చ్చలేదు. వాళ్ళు డబ్బుగలవారన్న విష యము సందేహమే. యెంత విధవయితే మాత్రం మెడలో ఒక్క గొలుసుండదా? మే డాక్టరో, ఇంజనీయరో అయితేనే ప్పుకుంటాను. ఏమండీ మీ చుట్టా బ్బాయి యెవరో నాల్గో సంవత్సరము దువుతున్నాడన్నారుకదా?"

"కనుకుంటాను. వెంకట్! మేనేజరును అడిగి. రెండు వందలు తీసుకున్నావట యెందుకురా?" ఉమాపతి కొడుకు వంకకు రిగాడు.

"పరీక్ష ఫీజు కడదామని అమ్మ గ్గర యాభై తీసుకుని వెళ్ళాను. బ్యాంక్ మూశారు. నా స్నేహితులు కూడా తమ పాయలు దాచమని నాకే యిచ్చారు. ఇంటికి వస్తుంటే జేబుకొట్టారు నాన్నా. అందుకని...." తను చెప్పింది అందరు నమ్మారా లేదా, అని అందరివంకచూశాడు. అందరూ తలవంచుకున్నారు.

"చాల్లే నీకుంటి సాకులు. నీకు వచ్చిన వయసు యెవరికి వచ్చిందిరా? ఇరవై ఆరేళ్ళు. ఇంకా బి. ఏ.లో లుటికీలు కొడు తుంటివి. యెంతసేపు సినిమాలు, షికార్లు, షాపువైపు వెళ్ళాలని తెలియదూ? ఆ ఢిల్లీలో చదివే ఆయన తనంతట తానే ఓ జమీందారు ననుకుంటాడు. జర్నలిజం వద్దురా అంటే అదే కావాలన్నాను. వేలకు వేను కావాలంటాడు. అందరి సంగతి ఆలోచిస్తే అయోమయంగా ఉంది."

'చిన్నపిల్లలు, తల్లితండ్రులమున్నామని

అమాత్రం చనువుగా ఖర్చుపెడతారు.''

"సరె నేనెందుకు నిష్ఠూరపడాలి. నీ ఇబ్బు, నీ యిష్టం, మన వద్దులువున్న వారిముందు చులకన కాకుండా పెద్ద తరహాగా మెదలమంటున్నాను." అతని మనసు బాగుండలేదు లేచి వెళ్ళిపోయాడు. ప్రసన్న కూడా తండ్రి వెనకాలే లేచి వెళ్ళిపోయింది, తల్లి ఒకేసారి ప్లేటు యెందుకు ఫిరాయించినదో యెంత ఆలోచించినా అర్థంకాలేదు. ఆ అందమైన యువకుడికి తన హృదయంలో స్థానం యిచ్చింది. తీయని ఊహలలో తేలియాడింది. ఏం జరిగిందని అమ్మ వద్దంటున్నదో అర్థంకాలేదు. అడుగడానికి అభిమానము అడ్డు వచ్చింది.

అందరూ నిద్రబోయినా దుర్గమ్మ నిద్ర బోలేదు ఆమె మానసం కుత కుత ఉడుకుతుంది భర్త మీద కసిగా వుంది సుశీల మీద మంటగా ఉంది టేబుల్ లైటు వెలిగించి ఆ రోజు పత్రిక తీసింది. ఇంతలో తలుపు తోసుకుని ఉమాపతి వచ్చాడు. "ఇంకా నిద్రపోనట్టుంది?'' అని మంచమ్మీద కూర్చున్నాడు. ఆమె లేచి కాళ్ళు ముడుచుకుంది "కనకం! నీతో ముఖ్య విషయాలు మాట్లాడాలని వచ్చాను పిల్లల ముందు మాట్లాడుకోవటం బాగుండదని అందరు పడుకునేవరకు వేచి వున్నాను.''

ఏమిటన్నట్టు చూసిందామె.

"మొదట మన పెద్దబ్బాయి సంగతి తీసుకుందాము. వాడు బేవారసుగా తిరగటం ఏం బాగులేదు.''

"ముఖ్య విషయమంటే ఏమిటో అనుకున్నాను. వాడిని ఆడిపోసుకోం దెప్పుడు? వయసులో ఉన్నప్పుడు తిరగక ముసలాడయి తిరుగుతాడా?'' అంది నిర్లక్ష్యంగా.

"సమంజసమయిన తిరుగుడయితే యెప్పుడు తిరిగినా పరవాలేదు. ఇందాక చిన్నవాళ్ళ ముందు చులకన చేయటం దేనికని ఊరుకున్నాను. వారం వారం వందలు ఖర్చు చేస్తుంటే ఈ ఆస్తి యెన్నాళ్లు వుంటుంది? యెంత వరకు నిజమో తెలియదు. పెద్ద గుమాస్తాచెప్పాడు పట్నంలో ఓ బజారు మనిషిని చేర దీశాడట. అందుకే ప్రసన్నకు వరుడు కుదిరితే వెంకట్ పెళ్ళి కూడా చేయాలని... ''

"పెళ్ళి అంటే వద్దంటానా? వయసులో తిరగంది ఎవరు? ఇంతకీ అమ్మాయిని వెతకాలి కదా?''

"కనకం! నీవు యెంత స్వార్థపరురాలవు! అమ్మాయి ఇంట్లోనే ఉంది కదా! వెతకటం దేనికి! '

'ఇంకా నయం! ఆ దిక్కులేనిదాన్ని కులం గోత్రం లేనిదాన్ని నా కోడలుగా అంగీకరిస్తానని యెలా అనుకున్నారు? నా తండ్రికేం? దర్జాగా పెళ్ళి చేస్తాను.'' అన్నది గర్వంగా తల యెగరేస్తూ.

"అది నిజమేనే, సుశీల తరపున ఎవరన్నా వచ్చి కోర్టులో దావా వేస్తే మన పని గోవిందా.''

"యెవడండి వేసేది? అడ్డమయిన దానికి పుట్టిన బిడ్డ వారసురాల ఖందనా? నా తమ్ముని ఆ స్తికి అసలయిన వారసురాలిని నేను, కోర్టు లెక్కతారట. కోర్టుకు యెవడో రానీ చూద్దాం"

"మరి నీ కొడుకు సంగతి తేల్చావు సుశీల సంగతేమిటి? పెంచినందుకు పెళ్ళి చేయాలి కదా!"

"ఇప్పుడేం తొందర? ప్రసన్న, శశి దానికన్న పెద్దవారున్నారు వారందరిని కానీయండి తరువాత ఆలోచిద్దాము" అన్నది ఆవలిస్తూ

"తరువాతే ఆలోచించాల్సింది కాని మొన్న చూచి వెళ్ళారు కదా! వారంతట వారే కట్నం లేకుండా చేసుకుంటామంటున్నారు పెళ్ళి చేసి మన బరువు తీర్చుకుంటే పోలా!"

"వీల్లేదు. నా బిడ్డకు వంక బెట్టినదాని ముఖం యెలా చూస్తాను" కంయన లేచింది

"నోటి తొందరే తప్ప ఆలోచన అసలు లేదు ఇంట్లో కూర్చుంటావు నీకు అంత బాధ ఉండదు బయట తిరిగేవాడికి నాకుంది బాధ యెంతమంది యెన్నిరకాల మాటలంటారో! అందరికి రఘు తెలుసు అందరూ ఒకసారి ధైర్యం చేసి సుశీల చేత దావా చేయిస్తే? అలాంటి అవకాశము యెందుకు కలుగనివ్వాలి! 'పెంచి మంచి యింట్లోకి యిచ్చారు' అని నల్గురు అనుకోనీ. రఘు ఆస్తి అనుభవించినా అతని సంతానానికి అన్యాయం చెయ్యలేదన్న తృప్తి మిగులనియ్యి. నీ కిష్టం లేకుంటే పెళ్ళివారితో మాట్లాడకు. యే దేవాలయం లోనో నాల్గు అక్షింతలు వేసేస్తాను."

"చూద్దాము లెండి. నాకు నిదరొస్తుంది" అన్నది దిండుకు చేరబడుతూ. అడ్డుపెట్టక ఒప్పుకున్నందుకు తేలికగా నిట్టూర్చాడు ఉమాపతి.

భర్తతో బొంకినదికాని నిద్ర రావటంలేదు దుర్గమ్మకు. యెంత ఆలోచించినా తన కూతురిలో ఉన్న లోపము, సుశీలలో గొప్పతనము ఆమెకు తట్టలేదు. సుశీల కంటే ప్రసన్నే అందముగా కనిపిస్తుంది. మరి వాళ్ళు సుశీలను కోరటములో అంతర్యము? డబ్బులేదు ఆత్మీయులు లేరు. అందము అంటే మామూలే! కేవలం దయతో అంగీకరిస్తున్నారా, కాదు. దీని వెనకాల యేదో కుట్ర ఉంది ఆమె కళ్ళ ముందు మధ్యవర్తిగా వచ్చిన వ్యక్తి మెదిలాడు. 'స్వయాన దుర్గమ్మ తమ్ముడు రఘు' అన్నమాటలు పదే, పదే ఆమె చెవుల్లో మారుమ్రోగాయి అతనే యేదో కుట్రపన్నుతున్నాడు. అతనిగురించి అంతా తెలుసుకోవాలి వెంటనే లేచి భర్తమంచం వద్దకు వెళ్ళింది 'ఏమండీ! ఒక్కమాట!" ఉమాపతి దుప్పటి ముసుగు తొలగించాడు, "అప్పుడే నిద్రవస్తుందని అన్నావు కదే!" అన్నాడు.

"అన్నాను. ఒక్కమాట! ఆ మధ్యవర్తిగా వచ్చినాయన యెవరండీ!"

# ఇదిగో ఒక నిరపాయమైన తలనొప్పి బిళ్ల!



# అవేదన్®

ఆశ్చర్యకరమైన ఎపెప్‌గలది
(ఎన్-అసిటిల్-పి-అమినోఫెనాల్)



తలనొప్పి బిళ్లను వేసుకొనుటకు భయపడి మీరు ఎన్ని సార్లు తలనొప్పిని ఎక్కువ సేపు అనుభవించేరు?

అవేదన్ మీ తలనొప్పికి నిరపాయమైనది ఎందుకంటె దానిలో ఆశ్చర్యకరమైన ఎపెప్ ఉంది అవేదన్‌తో చికాకైన చెడు ఫలితములు కలుగవు దానితో ఉపశమనము కలుగుతుంది—త్వరగా మరియు నిశ్చయముగా

కనుక తలనొప్పిని పోగొట్టుకోండి—నిరపాయముగా జలుబు ఫ్లూ యితర నొప్పులు కూడ దీనితో పోతాయి ఎపెప్‌గల అవేదన్‌ను వాడండి

**2 బిళ్లలు 15 పైసలు**

ఆశ్చర్యకరమైన ఎపెప్‌గల అవేదన్ తలనొప్పి జలుబు ఫ్లూలకు నిరపాయమైన నిశ్చయమైన ఉపశమనమును కలిగిస్తుంది




SQUIBB® SARABHAI CHEMICALS

® ఇ ఆర్ స్క్విబ్ & సన్స్ ఇన్‌కార్పొరేటెడ్‌వారి రిజి ర్ ట్రేడ్ మార్కుకు చిహ్నము దీని లైసెన్సుదారు ఉపయోగదారులు కర చ ద్ స్రెంచ ద్ ప్రైవేట్ లిమిటెడ్

Shilpi HPMA 37A/70 TEL




"నా స్నేహితుడు రఘుకు కూడా
స్నేహితుడే మనింటికి వచ్చేవాడు ఇప్పు
తను పొలం అది కొని అక్కడ వ్యవ
ాయం చేసుకుంటున్నాడు. అతనికి కొడు
లు లేరుసుమా!" నవ్వడానికి ప్రయత్నిం
డు.

"మీరు మీ హాస్యమూనూ!" విసు
క్కుంది "అతను మనమీద కుట్ర పన్ను
న్నాడేమోనని అనుమానంగా ఉంది"

"మనమీద కుట్ర పన్నితే అతనికేం
ాభం? అతను సాదా సీదా మనిషి
న పనేమో తనేమో అ మాత్రం పెళ్ళి
ాపులకు వచ్చాడంటే నామీది గౌరవము
తే? అతనిగురించి యెలాంటి అనుమా
ము వద్దు" నచ్చజెప్పజూచాడు దుర్గమ్మ
నుమానము బలపడిందే కాని తగ్గలేదు

"మీరు మంచివారు కాబట్టి అంతా
ంచివారిలాగే కనిపిస్తారు. వాళ్ళకి సుశీలని
ట్టదల యెందుకు? కారణ మూహించ
రా?"

"కొన్నింటికి కారణాలుండవు దుర్గా!
మీ తమ్ముడు జానకిని యెందుకు పెళ్ళి
చేసుకున్నాడు?"

"దానికి, దీనికి పోలికేమిటి? అది
ఒంటరిగా కల్సి వాడిని వలలో వేసుకుంది.
వీళ్ళు చూడడానికి వచ్చి ఇలా ప్లేటు పిరా
యించడంలో యేదో అంతర్యముంది.
రఘు కూతురు సుశీల ఇప్పుడు కానీ
కట్నం అక్కరలేదని పెళ్ళిచేసుకుంటాడు.
మర్నాడే అల్లుడి హోదాలో ఆస్తికోసం
దావా వేస్తాడు అదే వారి కోరిక, కుట్ర"
ఆవేశంగా అరిచింది దుర్గమ్మ.

"నువ్వు బట్టనుచూచి పాముని భయ
పడుతున్నావే అల్లాంటివారు కారు."

'అయితే నేనే చెడ్డదాన్నా? మీరె
ప్పుడూ యింతే ఆస్తిపాస్తులులేక
అనాధలై వచ్చిన ఆడవాళ్లు భర్తను
భర్తను తనమాటమీదనడిపించుకుంటారు.
అదేం దుఃదృష్టమో. లక్షల ఆస్తితో
వచ్చినా నామాట ఒక్కసారి వినరు.
రఘు అంటే నాకు ప్రేమ లేదనా? యెంత
అభిమానంగా పెంచుకున్నాను. మీరుకూడా

వాడినో యజమానిని చూచినట్టే చూచారు. పెళ్ళి విషయంలో ఒక్కమాట. ఒక్క మాట మీతో చెప్పాడా? మీరు వద్దనే వారా? పెద్దవారన్న గౌరవము చూపాడా?'' ఇరవై సంవత్సరాలనాడుజరిగినవిషయము ఇప్పుడు జరిగినట్టే బాధపడుతూ కన్నీరు కార్చింది ఉమాపతి పొంగిపోయాడు భార్యనోట మంచి అనిపించుకొని పొంగి పోని మొగాడెవడు? దుర్గమ్మ కన్నీరు వత్తాడు. "ఊరుకోవే నీమాట కాదని ఏం చేశాను? నన్నేం చేయమంటావు చెప్పు?" అనునయంగా అడిగాడు. మన పిల్లల భవిష్యత్ ఆలోచించమంటున్నాను. ఆ పిల్లది మన రఘుకు పుట్టిందనేగ్యారంటీ ఏముంది? బజారు ఆడది యెంతమందితో తిరిగిందో! వాడు గుడ్డివాడయితే మన మెలా అవుతాము? వెనకా ముందు ఆలోచించండి.

"నా స్నేహితునికి సుశీలంటే ఎందుకు ఇష్టముంటుంది? అది ఆలోచించాలి

"మీతో వచ్చిన చిక్కే ఇది. కొందరికి పచ్చని కాపరాలు చూస్తే ఓర్వలేని తనం బయలుదేరుతుంది సుశీలకు పెళ్ళి చేద్దాము వీళ్ళకుమాత్రం వద్దు నాకేమో భయంగా ఉంది.''

"అట్లాగేలే. సుశీలకు వేరేసంబంధము వుందని రాసేద్దాము ఇక నీ భయం తీరి నట్టేనా?''

''అప్పుడేనా? ఈ శనిని యింట్లో నుండి విరగడ చేస్తేగాని నాకు శాంతి వుండదు, మన పిల్లల భవిష్యత్‌కు అడ్డుగా నిల్చున్నది. రేపే వేరే సంబంధము వాకబు చేస్తాను. ఒక్క మాట మీరు వినాలి. దాని విషయములో జోక్యము కలుగజేసుకోనని మాట ఇవ్వండి ''చేయి చాపింది దుర్గమ్మ. కొన్ని బలహీనమైన క్షణాలకు బానిస అవుతాడు వ్యక్తి అలాగే జరిగింది ఉమాపతి విషయములో. భార్య చేతిలో చేయి వేసి, అలాగే దగ్గరకు లాక్కున్నాడు.

సుశీలకు కొత్తరకమైన సాధింపు ఏమిటో అర్థం కాలేదు. అత్త నోటికి తాళం లేదని తెలుసు, కాని మరీ ఇంత నీచంగా మాట్లాడుతుందని తెలియదు. ఇమామ్ కూరగాయలు తెచ్చాడు. "నిన్న కాయలు తేలేదేమిటిరా?'' కూరగాయలు వేరె పెడుతూ అడిగింది సుశీల.

"అదేమిటి చిన్నమ్మా! కూరగాయలు ఈ రోజువి తాజావి నిన్నటివంటా రేమిటి"

"నీతో చావు వచ్చిందిరా బాబూ! నిమ్మకాయలు యేవి?'' అన్నాను.

"చామదుంపలు చచ్చినట్టున్నాయా? మాంచివి యేరి తెస్తేను'' ముఖం చిన్న జేసుకున్నాడు. అది పనిగాదని సుశీల ఓ నిమ్మకాయ తెచ్చి చూపింది అవి యేవి అన్నట్టు పైగజేసి అడిగింది. ఇమామ్‌కు అర్థమైంది, తన తెలివితక్కువ తనానికి నవ్వుకున్నాడు. "మరిచిపోయానమ్మా" అన్నాడు, వాడి ముఖం చూస్తే సుశీలకు నవ్వాగలేదు. వేణు కూడా అక్కడే వుండి




వాడి చేష్టలను అనుకరిస్తూ నవ్వాడు. యెప్పుడొచ్చిందో ఏమో కనక దుర్గమ్మ యెవరూ చూడలేదు. "యెందుకే ఆ విరగ బాటు?" సుశీల తలపైన ఒక్క పోటు పొడిచింది "సిగ్గూ యెగ్గూ అన్నీ వదిలి పెట్టావా? అడ్డమైన వెధవలతో పరిహా సాలా? అమ్మ బుద్ధులే వచ్చాయా? పడితే గట్టివాడినే పట్టరాదే! పూటకి గతి లేని వెధవలు నీకేం కూడు పెడతారు?" సుశీల మ్రాన్పడి పోయింది ఇమామ్‌కు తండ్రి వయసుంటుంది. ఇంత అన్యాయంగా మాట్లాడుతుందేం? "అత్తయ్యా! మీరేం మాట్లాడుతున్నారు?"

"కోపం కూడానా కులపాసంకురాలా వెళ్ళు. మళ్ళీ ఆ ఇమామ్‌తో మాట్లాడు చెప్తాను."

ఇమామ్‌కు వినిపించకపోయినా సుశీల తనతో మాట్లాడినందుకే యజమానురాలు కోపగిస్తుందని తెలుసుకున్నాడు. సుశీల వంక జాలిగా చూచి వెళ్ళిపోయాడు ఆ రోజు సాయంత్రము వరకు తల దువ్వ కోలేదు తన దురదృష్టానికి వగస్తూ అన్య మనస్కంగా గడిపింది. జుట్టు జడలో నుండి వూడి ముఖాన్ని చిరాకు పెట్ట సాగింది పనంతా అయ్యాక తల విప్పు కుని నూనె రాయటం మొదలు పెట్టింది. దుర్గమ్మ మంచినీళ్ళు అడిగితే తీసుకెళ్ళి యిచ్చింది

"అసుర సంధ్యవేళ యిప్పుడు తల నిరబోసుకున్నా వేమిటే? అందుకే మొగ

వాడి కళ్ళున్ని నీ మీదె వుంటాయి సంసారి వేషాలేనా? నీవు బజారు పాలవుతావే. నా తమ్ముడు మంచివాడు కాబట్టి నీ యమ్మ గుట్టు దాగినది " గొంతు చించుకుని అరవసాగింధి. సుశీలలోని సహనం హరించుకు పోయింది. "అత్తయ్యా! యెదురుగా వున్నాను. నన్ను యెన్ని మాటలయినా అనండి. చచ్చి స్వర్గాన వున్న అమ్మనెందు కంటారు? ఆమె మీకేం అపకారం చేసింది."

అణిగి, మణిగి పడిఉంటే అమాయకురాలు యెదిరించి మాట్లాడే సరికి సహించలేకపోయింది దుర్గమ్మ చేతిలోని గ్లాసు విసిరి సుశీల కేసి కొట్టింది జుట్టుపట్టి వంచి, యెడా, పెడా బాదినది నాల్గులోజుల నుండి పేరుకున్న కసి, కరిగి నీరయ్యే వరకు బాదినది. శశి అడ్డుకుంది "అమా! వదులు చచ్చిపోతుందే. వదులమ్మా.' తల్లిని దూరం తీసు కెళ్ళింది దుర్గమ్మ ఆవేశం చల్లారింది. అసహాయంగా నేలకంటుకుపోయి రోదిస్తున్న అమాయకురాలిని చూస్తే శశికి జాలేసింది. చేయూతనిచ్చి లేవ దీసినది. పెరట్లోకి తీసుకువచ్చి ముఖాన నీళ్ళుకొట్టి, కొంగుతో వత్తింది. చేతికి ఉన్న మట్టిగాజులు చిట్లి గ్రుచ్చుకుని రక్తం స్రవించ సాగినది. రక్తం తుడిచి పసుపు అద్దినది.

"అమ్మ కోపం తెలుసు. యెందుకు యెదురు చెప్పావు సుశీ?" ప్రేమగా అడిగింది.

"ఊరికేనే లేని నిందలు పెడితేయెలా? ఇమామ్‌తో సరసాలు అదేంత సిగ్గుచాలినా శశీ."

"అమ్మ కోపం వేరులే. మొన్న పదిహేను రోజుల క్రితం వచ్చిన పెండ్లి కొడుకు నిన్ను చేసుకుంటానని అన్నట్టున్నాడు. అది స్పష్టంగా చెప్పలేదు. అమ్మా నాన్నల మాటలను బట్టి అర్ధం చేసుకున్నాను. అందుకే కోపం పద కాసింత కాఫీ త్రాగుదువుగాని." ఉన్నట్టుండి శశి కింత దయ కలిగిందేమిటా, అని ఆశ్చర్యంపోయింది సుశీల. స్టౌ వెలిగించి రెండు గ్లాసులలో కాఫీ కాచి పోసింది. ఒకటి సుశీల కిచ్చి, రెండవది తను తీసుకుంది. చిందర, వందరగా ఉన్న జుట్టును చక్కగా దువ్వి జడ అల్లింధి, సుశీల హృదయము అపరిచితుడయిన యువకునిపట్ల కృతజ్ఞతతో నిండి పోయినది "సుశీ! ఆ వరుడు నిన్ను కోరటంలో తప్పులేదే. ఎంత అందముగా ఉన్నావో. నేను మొగపిల్లవాడి నయితేనా, రాక్షస వివాహమయినా చేసుకునేదాన్ని." సుశీల నుదుట అందముగా తిలకం దిద్దినది నీరసంగా నవ్వింది సుశీల.

"పోనిలే శశీ! నీకయినా ఆమాత్రము అభిమాన మున్నది" తులసికోట దగ్గరే కూర్చుంది

రాత్రి భోజనాల దగ్గర శశి వడ్డించడం చూచి అందరూ ఆశ్చర్యపోయారు. సుశీలను కొట్టిన సంగతి యెవరికి తెలియదు.

"అది అప్పుడే వచ్చిపోయిందా? నువ్వు చెస్తున్నావేమిటి?"

"నువ్వు అన్నింటికి రాద్ధాంతము చేస్తావేమిటమ్మా! చావగొట్టావు. అది మనిషే. ఒక్కపూట నేను చేస్తే అరిగి పోయానా? నేను ఆడపిల్లను కానా?" కూతురి వంక ఆశ్చర్యంగా చూచాడు ఉమాపతి వెంకట్ చప్పట్లు కొట్టాడు. "అయితే చెల్లాయి వంట కూడా తమరే చేశారేమిటి? తొమ్మిది దాటితే హోట ళ్ళుండవు త్వరగా చెప్పు."

"నువ్వేం వెక్కిరించాల్సిన పనిలేదు వంటకూడా చేస్తాను చూడు" సవాల్ చేసింది శశి

అందరి భోజనాలు అయి యెవరి గదు ల్లోకి వాళ్ళు వెళ్ళిపోయారు శశి రెండు పళ్ళాలు బల్లమీద పెట్టి. సుశీలచేత బల వంతముగా భోజనం చేయించింది ఈ అపారమైన కరుణ యేమిటో అర్థంగాక తెల్లబోయింది సుశీల లైట్లు ఆర్పి సుశీల నులకమంచము మీద నడుము వాల్చింది. అరగంట గడిచాక సెంటువాసన గుప్పు మంది ఉదిరిపడి లేచింది అప్సరసలా తయారయి వచ్చింది శశి వాకిట్లో సన్నగా ఈల వినిపించింది "సుశీ! ఓ స్నేహితు రాలితో సినిమాకు వెడుతున్నాను అమ్మకు చెప్పితే అనవసరంగా అనుమాన పడు తుంది. కాస్త మెలుకువగా ఉండి తలుపు తీస్తావు కదూ? యెవ్వరితో చెప్పకు మా బంగారు ..." సుశీల చేయి ముద్దు పెట్టు కుని వెళ్ళిపోయింది తేరుకుని వాకిట్లోకి వచ్చేసరికి, సంధు చివరనున్న స్కూటరు కదిలిపోయింది సుశీల హృదయం కంపించిపోయింది నిద్రకు దూరమై ఇంటివారి మన స్తత్వాలకు నగస్తూ దొర్ల సాగింది, మిలిన రాత్రంతా. శశి నాల్గు దాటాక వచ్చి పడుకుంది

దుర్గమ్మ ఆ రోజు పిల్లలతోపాటు తయారయి హైద్రాబాద్ బయలుదేరింది. యెందుకు వెడుతుందో యెక్కడికి వెళు తుందో యెవరికీ చెప్పలేదు. రాత్రి యేడు గంటలకు ఉమాపతి ఇంటికి వచ్చేసరికి వేణును కూర్చో బెట్టుకుని లెక్కలు చెప్తూ సుశీల మాత్రం ఉంది.

"మీ అత్త ఇంకా రాలేదా అమ్మా?"

"లేదు మామయ్యా. మీరు భోజనం చేస్తారా కాఫీ తీసుకుంటారా?"

"కాఫీ తీసుకుంటాను. వెంకట్, ప్రసన్న వీళ్ళంతా ఏరమ్మా?"

"బావ పదిమైళ్ళ దూరాన ద్రాక్షతోట లున్నాయట చూచి వస్తానన్నాడు ప్రసన్న వదిన స్నేహితురాలింటికి వెళ్ళింది. శశి స్నేహితులతో సినిమా కెళతానంది. ప్రేమ అత్తయ్యతో వెళ్ళింది.

"ఊఁ" అలసటగా కుర్చీలో కూర్చు న్నాడు. సుశీల కాఫీ తెచ్చింది రాత్రి తొమ్మిదయినా యెవరూ ఇల్లు చేరలేదు. ఉమాపతి అసహనంగా పచారు చెయ్య సాగేడు. దుర్గమ్మ వచ్చింది మొదట. తరు వాత ఒకరొకరే ఇల్లు చేరారు. యెవరిని

యే మడిగినా భార్య ముందు నోరు చేసు కుంటుందని భయపడి, అన్నంతోపాటు కోపాన్నికూడా మ్రింగాడు ఉమాపతి.

రాత్రి పదకొండు దాటాక శశి మళ్లీ బయలుదేరింది "సుశీ! జాగ్రత్తగా తలుపు తీయాలి"

"శశీ! నాకంటె పెద్దదానవు ఈసంగతి పెద్దవాళ్ళకు తెలిస్తే"

"నువ్వు చెప్పందే ఎవరికి తెలియదు నీ సంగతి ఆలోచించి మసలుకో." హెచ్చరించినట్టే చెప్పి వెళ్ళిపోయింది. అదే సమయాన తను సాధించిన విషయం భర్తతో చెప్పింది దుర్గమ్మ.

" ఎంత లేదన్నా అయిదారు లక్షల ఆస్థి. రెండు కార్లున్నాయి ఇద్దరి పిల్లలకు ఇవ్వాల్సింది యిచ్చాడు అంతా దీనిదే, అడిగే నాధుడు లేడు యెంతోమంది మళ్లీ చేసుకోమని సలహా ఇచ్చినా వినిపించుకో లేదు నేను యేదో బంధుత్వము పురస్క రించుకుని బ్రతిమాలితే విన్నాడుగాని "

"అంత గొప్పగా చెప్తున్నావు అతని వయసు యెంతుందే?"

"యెంతో యెక్కడ? మహా ఉంటే నలభై అయిదు ఉంటాయి మేము చిన్న వాళ్ళముండగా పట్నం మామయ్య అంటే దేవు డొచ్చినట్టు సంబరపడిపోయేవారము. బుట్టలకొద్ది పళ్లూ, సంచులనిండా పిప్పర మెంట్లు తెచ్చేవాడు రఘు కూతురు 'మామయ్యా' మరీ సంబర పడిపోయా."

"దుర్గా! భగవంతుడు నీకు పిల్లలనెలా యిచ్చాడో నే. నీ చిన్నప్పుడంటావు నలభై అయిదేళ్ళంటావు నీకే నలభై మూడుంటే అతనికి యాభై దాటి ఉంటాయి"

"దాటితే దాటాయి. దాని తల్లి, తండ్రి మీకు పెద్దరికము యిచ్చి గౌరవిస్తే ఇంకా దాన్ని పువ్వులలో పెట్టి పూజించేవారు. మీ పిల్లల బాగోగులు మీరు చూచుకోండి. దాని విషయము నాకు వదలండి. రక్త సంబంధం కల్సినవాడు. విసుగు వచ్చి నప్పుడు నాల్గు రోజులుండి రావచ్చు. ఇంతోటి అమ్మాయి ఆయనకు దొరక దనేనా? మీకు చెప్పటం నాదే బుద్ధి తక్కువ," విసురుగా లైటు ఆర్పి పడు కుంది భార్యా విధేయుడని ఆదిలోనే పేరు గాంచిన ఉమాపతి ఉస్సురని ఊరుకు న్నాడు.

రోజులు గడుస్తున్నాయి సుశీల వివా హము త్వరలో జరుగుతుందని అందరికి చెప్పింది దుర్గ వరుని విశేషాలు, వివరాలు మాత్రం చెప్పలేదు కంసాలి అతనువచ్చి సుశీల నడుము కొలత, గాజుల కొలత తీసుకువెళ్ళాడు. ఓ రోజు ఓ కారులో యాభై చీరలు వచ్చాయి

"ఒసేయి సుశీలా! వచ్చి నచ్చిన రంగులు యెంచుకో తల్లీ రేపు నా మీద తప్పు మోపవద్దు." నెమ్మదిగానే పిలచింది. సుశీలకంతా అయోమయంగా ఉంది. వరు డెవరో, అతని సుంచి, చెడు ఏమీ తెలి యదు. చీరలు, నగలూ చూస్తే ఉన్నవారి లాగే కనిపిస్తున్నారు అ రోజు వచ్చినవా రయితే కారుకదా? ఆమె ప్రశ్నకు వెంటనే జవాబు వచ్చింది. (సశేషం)




ఎంతపని చేశారు మేష్టారుగారూ మీరు

నాకొంప నిలువునా ముంచేశారు

నా భవిష్యత్తు నేలమట్టం చేశారు

నా ఆశలన్నీ అధ పాతాళానికి అణి చేశారు

మీరంటే యిప్పటికీ గౌరవం వదులుకోలేనందుకు దుఃఖపడుతున్నాను మీరంటే యిప్పటికీ అభిమానం చంపుకోలేనందుకు బాధపడుతున్నాను ఇంత అన్యాయం చేస్తారా! అని మిమ్మల్ని అడగడానికి వస్తే నువ్వు చేసిందే అన్యాయం నేను చేసింది న్యాయం అని తీర్పుచెప్పేరు

అలాగా!

అసలు న్యాయమంటే ఏమిటో చెంచెం నిర్వచించండి విందాం నీతి అంటే ఏమిటో చెప్పండి ఎప్పటికయినా తెలుస్తుందాం

మనసా వాచా కర్మణా ఎక్కడా వెలితి అన్నది స్ఫురించనీయకుండా కల్మషం అన్నది కలవకుండా జీవించడమే మానవ ధర్మం అదే న్యాయం

అని మీరే ఏదో సందర్భంలో చెప్పినట్టు గుర్తు

కల్మషం కలవకుండా జీవించడం

సాధ్యమే అంటావా?

ఇంతవరకూ వచ్చాక యింతా వెను దియ్యడం ఎందుకు, అడిగేస్తున్నాను, ఆలోచించి చూడండి

కల్మషం కలవకుండా జీవించగలుగు తున్నారా మీరు?

మీరు పీల్చేగాలి మీ యింటి ముందు మురుగుకాలవమీద నుంచి మాకువస్తోంది. మాకు లభించే సూర్యకాంతి ఫేక్టరీ పొగల మేఘాలలో ఉక్కిరి బిక్కిరై అంతస్థుల కత్తెరబోనుల్లో ముక్కా ముక్కలై చెల్లా చెదరుగా మీకు దొరుకుతోంది మీకు తాగ డానికి గాని వాడడానికి గాని అంత సుళు వుగా మంచినీళ్ళు దొరకవు, నాకు తెలుసు పాలలో మందుల్లో కలపడానికే ఎక్కడ లేని నీళూ\ చాలకపోతే మీకెలా దొరుకు తాయి దొరికినా అందులో ఇంపుకన్న కంపు ఎక్కువ. మీరు తినే బియ్యంలో పప్పుల్లో రాళ్ళు సరేసరి. పంచదారతోపహా సూపర్ఫైను చెరుకు పిప్పి కలుపు తున్నారు

పంచభూతాలే కల్తీయై పాపభూయిష్టం అయిపోయాయే, 'నిష్కల్మషంగా' ఎలా బతుకుతున్నారు సార్ మీరు?

మరెక్కడుందండీ న్యాయం!

బ్లాక్ మార్కెట్లోగాని పాలడబ్బాలు దొరకని రోజున ఏం చేశారు మీరు. నాలుగు తన్ని మీ పిల్లల్ని పడుకోపెట్ట గలిగేరా?

లోకంలో యింతగా 'కరప్షన్' పెరిగి పోతున్నప్పుడు, యింతగా 'బిజినేస్ మైండెడ్నెస్' అభివృద్ధి చెందుతున్నప్పుడు సందర్భానుసారంగా రోజుకో రంగు పులుముకునే దాన్నే న్యాయం అంటారు.

చేకిట్ ఫ్రమ్ మీ.

మీకు యిష్టమైనవి ధర్మాలూ, మీరు అనుసరించడానికి మాత్రమే వీలయ్యేవి ధర్మసూక్ష్మాలూ అనిపించుకోవు సార్.

'యథాశక్తి పాత్రను పోషించారు' అన్నది విధి నిర్వహణ అవదుసార్ .

'అందరికీ ఒకలాంటి న్యాయం జరగక పోడమే ఈనాటి న్యాయం అదే నేను చేశాను' అని మీరనండి, మళ్ళీ మాటాడను నేను నిష్పక్షపాత బుద్ధితో పని చేస్తున్నా మని చెప్పుకునే కొన్ని మన పత్రికలే స్థితే జాగర్తగా గమనించండి

పుస్తకాల విమర్శలు అనే పేజీ తిర గెయ్యండి దూది ఏకినట్టు ఏకిపారేస్తు న్నారు మంచిదే చెడు ఉంటే చెండాడ వలసిందే అదే పత్రికలో 'చిత్రసమీక్ష' పేజీ కొంచెం చూడండి. ఎంత దరిద్రగొట్టు సినిమా అయినా సరే 'గొప్ప పనితనం చూపించబడి, మొదటి నుంచి చివరకు గొప్ప ఉత్కంఠ పోషించబడి, కథలోను, కథనంలోను ఎంతో నవ్యత చూపించబడి, కడుపుబ్బ హాస్యం సృష్టించ బడి సందేశాత్మకంగా' ఉంటుంది!

ఎడ్వర్టైజ్మెంట్సు సంపాదించుకో డము కోసం ఈ ఎడ్వర్టైజ్మెంట్సు తప్పవు. వారి ప్రతాపమంతా పూర్హెల్ప్

లెస్ రైటర్ మీదే.

న్యాయాన్యాయ విచారణ ఎత్తి చూప డానికి యీ ఉదాహరణ యిచ్చాను.

కేర్‌ఫుల్‌గా స్టడీ చేస్తే రోజుకి కొన్ని వందలు యివ్వొచ్చు

కాని అనవసరం

ఇప్పుడు నా గుండె అసలు విషయా నికి సంబంధించని అనేక విషయాలు వెళ్ళ గ్రక్కింది

కమింగ్ టు ది పాయింట్

నాకు మా మేనమామ కూతురు సరో జని చేసుకోవాలనుంది

దానికీ నన్ను చేసుకోవాలనుంది

అయితే మా యిద్దరికీ శరీరాన్ని దోచుకోడం, మనసుల్ని కొల్లగొట్టడం— యిలాంటివే కాక యింకా కొన్ని విచిత్ర మైన అభిప్రాయాలున్నాయి

సుఖపడాలి మేము

సుఖపడాలంటే బాగా డబ్బుండాలి మాకు.

బాగా డబ్బుండాలంటే సరోజ, వాళ్ళ నాన్నచేత బాగా పెద్ద మొత్తంలో కట్నం యిప్పించాలి నాకు.

కట్నం ఇప్పించాలంటే డాక్టరు చదువు లోనైనా అడుగు పెట్టాలి నేను డాక్టరు చదవాలంటే పియ్యూసీలో బయాలజీ గ్రూపు తీసుకోవాలి. తీసుకోవడమే కాదు బాగా హై పెర్సెంటేజి మార్కులు రావాలి

అదిగో—అక్కడే గొంతుక నొక్కేశారు మేష్టారు మీరు। ఒక్క మాటలో నాశనం చేసి పారేశారు.

జూ ఆలజీ పేపరేమో ఈజీగానే ఉంది.

చాలా బాగానే రాశాను కూడా.

బాటనీ పేపర్ చాలా కష్టంగానూ, కోర్సులో లేని ప్రశ్నలతోనే ఉంది.

ఆ పేపరిచ్చినవారికి ఆమాత్రం బుద్ధి ఉండక్కర్లేదా ?

మాట వరసకి, మా పియ్యూసీవాళ్ళం- యీ గ్రూపు వాళ్ళం—పదివేల మంది ఉన్నామనుకొందాం. ఒక్కొక్క కేండి డేటుకి స్నేహితులు గాని బంధువులు గాని సగటుని నలుగుర్ని వేసుకుందాం.

అంటే అలాంటి దిక్కుమాలిన పేప రిచ్చిన ఆ మహానుభావుణ్ని ఆ రోజు ఎంత మంది తిడతారు?

ఏభై వేలన్నమాట, అవునా ?

ఈ ఏభై వేలలో ఒక్కడికి వాక్శుద్ధి ఉన్నా ఆ పేపరిచ్చిన పెద్ద మనిషి పెళ్ళాం పుస్తె పుటుక్కున తెగిపోతుంది!

ఆ మాత్రం జ్ఞానముండొద్దా, అంత అనుభవం ఉండే ఆ అయ్యవారికి?

ప్రిపరేషన్‌లో నాది ఏ లోపమూ లేదు. నమ్మండి.

అసలు ప్రిపరేషన్ ఎంత కష్టమో, అత్తా ఒకింటి కోడలే అన్నట్టు—మేష్టరూ ఒకనాటి స్టూడెంటే అని మీకు తెలియదు గనకనా? అయినా మీదేం గొప్ప, మను పిన్ని ఎట్రాక్షన్సు లేవుట !

బొటనీ బుక్కు ముందేసుకు కూచుంటే నాకేం జ్ఞాపకమొస్తాయో మీకు చెప్పనా?

ఇదిగో ఇదే.

మా అమ్మ సుప్రభాతం అర్థం చెప్పించు కుంటూ ఉంటుందిలెండి. శలవలికి యింటి కెళ్ళినప్పుడు విన్నాను, ఓ ముక్క. కాంతా కుచాంబురుహ కుట్మల లోలదృష్టే అనగా? 'ప్రియురాలి తామర మొగ్గల వంటి కుచములయందు ఆసక్తమైన దృష్టి గలవాడా!' నేను కళ్ళు మూసుకుంటే నాకేం కనపడతాయో తెలుసా? ఇవిగో ఇవీ ము మ్ము మ్ము మ్ము మ్మొద్దంటే చేదా? నీకా ఉద్దేశమ్మే లేదా? అని పాడుతున్నప్పుడు సెక్సీగా తిరుగుతున్న విజయలలిత పెదిమలు. మనసంతా చిచ్చు బుడ్డిలా జ్వలించిపోతూంటే అందులో బాఒనీ అనే పచ్చ గడ్డి ఏం నిలబడుతుంది చెప్పండి?

అయినా నేనెంత కంట్రోలు చేసుకున్నానో ఆ సరోజకే ఎరుక. ఇనప కచ్చడాలు కట్టిన మునిపుచ్చులే చిత్తయిపోతే—యీ యిరవై యో శతాబ్దంలో, మొన్న మొన్న షేవింగు మొదలెట్టిన పసివాడిని నన్నెంతకని చావమన్నారు చెప్పండి!

మాయువతరాల మనసు ఏలేవి, దిక్కుమాలిన పెట్టె బుక్కులు కాదు

వీలయినంతవరకు బట్టల పొదుపు చేసే-అంటే పైన అరగజం కింద పావు గజం మాత్రమే వాడే సుందర సినీవాసులు మమ్మేలు యువరాణులు.

పోనీ మాకు పాఠాలు చెప్పే లెక్చరర్లు!

కాపీకొట్టి డిగ్రీలు తెచ్చుకున్నవాళ్ళు.

కాళ్ళు పట్టి డాక్టరేట్సు కొట్టుకొచ్చిన వాళ్ళు

గైడ్సు చదివి ప్రిపేరై పాఠాలు చెప్పే వాళ్ళు.

అందరూ కాకపోవచ్చు-కాని ఎందరో అందులో మహానుభావులు!

ఇక మా హాస్టల్సు ఎంత బాగా నిర్వహింపబడుతున్నాయో ఒక్కసారి వచ్చి చూడండి, ఏ రూంకయినా సరే

ప్రతీ అలమారలోనూ నిలువెత్తు వెంకట్రమణమూర్తి పటం జారబెట్టి ఉంటుంది దాని వెనక చెయ్యి పెట్టి ఇవతలికి లాగండి

భయపడకండి. ఇదేం రహస్యం కాదు.

చుక్కేసుకుంటే చుక్కల్ని చూపించే స్కాచ్ సరుకు సీసా దొరుకుతుంది. కలి

---

ఒకానొక రోమియో ఒక కాలే జ్జూలియట్ ని గాఢంగా ప్రేమించేసాడు "నువ్వు నన్ను పెళ్ళిచేసుకోక పోతే నేను చచ్చిపోతానంతే" అని బెదిరించాడు.

"చూద్దాంగా" అని జూలియట్ అతన్ని తిరస్కరించింది. ఆ తరువాత యాభై ఏళ్ళకు అతను నిజంగానే చచ్చిపోయాడు.

కుటుంబము అంతటికి ఫోస్ఫోమిన్® వల్ల ఆరోగ్యము కలుగును







ఫోస్ఫోమిన్
• శక్తిని పెంపొందించును.
• ఆకలిని అధికము చేయును.
• సహన శక్తిని హెచ్చించును.
• శరీరము యొక్క రోగనిరోధక శక్తిని ఎక్కువ చేయును




SQUIBB
Phosfomin
VITAMINS ELIXIR




SQUIBB
SARABHAI CHEMICALS
ఫోస్ఫోమిన్
ఆకుపచ్చని పండ్ల రుచిగ
విటమిన్ టానిక్
Shilpi HPMA 35A/70 1

యుగ దైవం ఆ ప్రభువుకి, కలిగినవారు చేసే నిత్య నైవేద్యం యీ మధువు.

ఆరగింపు పెట్టి గర్రున త్రేన్చుందే ఏ రోజూ మాకు మొదలయినట్టుండదు. ఇన్ని ఆకర్షణలలో ఎంత కష్టపడి చదివానో నాకేం యిచ్చినా మీలాంటి విద్యావేత్తల రుణం తీరదు

పొట్టులాంటి ఆ సరుకు ఎలాగో బుర్ర లోకి ఎక్కించుకున్నాను. ఆంజనేయ స్వామిని తలచుకుని పరీక్ష హాలులో కళ్లు తెరిచాను.

ఏమిటిది !!

బాటనీ పేపరు ఇలా ఉందేమిటి ?

రోజా రమణిలా ఉంటుందనుకున్నాను.

ఋష్యేంద్రమణిలా ఉంది!

ఇంకేది దారి నాకు!

అనుకున్న ఒక్క ప్రశ్నా లేదే, ఏం చెయ్యాలిప్పుడు ?

మానవ మాత్రులం, సంసార పక్షంగా జీవించాలనుకునేవాళ్ళం

'కష్టాలు మనుషులకి రాకపోతే మానులకి వస్తాయా !' అని ధైర్యం తెచ్చుకున్నాను అత్యవసర పరిస్థితి ప్రకటించింది నా మనస్సు.

ఆపద్ధర్మంగా ఏం చేసినా తప్పు లేదని హెచ్చరించింది నా బుద్ధి.

వంశం నిలుపుకోడం కోసం కుల స్త్రీలకి, పరాయి పురుషుడి పక్కలో పడుకున్నా తప్పులేనప్పుడు, పరీక్ష మరీ కష్టంగా ఉన్నప్పుడు ప్యాసుకావడంకోసం అయినింటి విద్యార్థికి పక్కనున్న వాడి పేపర్లో తొంగి కాపీకొట్టడం మనుషుల రక్తంలో ఉంది చూసి నేర్చుకోనిదే— పెద్దల్ని చూపి వోల్చుకోనిదే—పిల్లలు ఆ విధంగా అనుకరించనిదే ఎటువంటి ఎదుగుదలా ఉండదు అంతవరకు ఎందుకు, తల్లిపిట్ట, పిల్లపిట్టకి యిచ్చే ఫస్ట్ లెసన్ ఏమిటి? 'అందరూ ఎగురుతున్నారే, వెర్రి బాగులకూన! నువ్వూ వాళ్ళని చూసి కాపీ కొట్టి ఎగరడం నేర్చుకోవే' అని కాదా ? కాపీ తియ్యవలసిన అవసరమే లేకపోతే టైపురైటర్లు ఉండవు అచ్చు యంత్రాలు పని చెయ్యవు పుస్తకాల కాపీలు ఉండవు. ఉద్యోగాలూ ఉండవు ! 'బుద్ధిమంతుల అడుగుజాడలలో నడువు' అని తమ చోట్లే శలవిస్తారు. నా ఎదుటి సీటులో

---

భార్య: "చూడండి! ఆ ఇంటిమొగుడూ, పెళ్ళాలు ఎంత ముచ్చటగా ఉంటారో! ఆ అబ్బాయి రోజూ ఆఫీసుకెడుతూ పెళ్ళానికి టాటా చెప్పిదుకి వెడతాడు, మీ కల్లాంటి సరదాలే లేవాయే!'

భర్త:- 'నేనూ టాటా చెబుదునుగాని, ఆఅమ్మాయి ఊరుకుంటుందా అని."

ఈాదున్న గంగాధరం ఎంతో బుద్ధి మంతుకు. ఫస్టు మార్కులన్నీ వాడివే.

వాడిని చూసి, వాడు రాసిందే రాసి. బాగుపడదామని సద్బుద్ధితో ప్రయత్నిస్తే నన్ను పట్టుకున్నారే, యిదేం దుర్బుద్ధి సార్ మీకు? అదిగాక ఏ పద్ధతికయినా మొదలన్నది ఎక్కడో ఉండివుండాలి, మన పెద్దలు చేసుకున్న పుణ్యంవల్ల, ఎవరో ఎప్పుడో మహానుభావుడు యీ కాపీకొట్టే పద్ధతి ప్రవేశపెట్టి ఉండాలి.

నిజంగా ఆ పద్ధతిలోనే మీరు చెప్పి నట్టు తీవ్రమైన లోపం ఉండివుంటే ఇన్నాళ్ళపాటు 'మూడు పువ్వులూ ఆరు కాయలు'గా ఇంతగా దేశ వ్యాప్తంగా అల్లుకుని ఉండేదంటారా ?

లోకువగా దొరికేను గనుక నన్ను పట్టుకోగలిగారు మీరు

మా రూంలో నాకు నాలుగు సీట్ల అవపల వైస్ ప్రెసిడెంటు తమ్ముడు పుస్తకం దగ్గిర పెట్టుకు రాశాడు.

వాణ్ణేం చెయ్యగలిగేరు మీరు?

అటు చూళ్లేదంటారు ఎలా నమ్మడం ఆ మాట ?

చూడకపోతే ఎందుకు చూళ్లేదు, అది ప విధి నిర్వహణ లోపం కాదా ? అసలు చూడ్డానికి మీకు ధైర్యం ఉందా ?

ఆ పక్క రూంలో యిన్విజిలేటర్సు ఆన్సర్సు డిక్టేటు చేశారు.

మా అందరి ఆన్సర్సు పేపర్సూ ఒకరే దిద్దుతారు.

మా భవిష్యత్తులో జరగబోయే యీ తేడాలకి, అన్యాయాలకి జవాబుదారీ ఎవరు?

దొరికినవాడే దొంగ.

దొరక్కుండా అన్ని ఏర్పాట్లూ చేసు కునే దొంగ దొర !

నేరాలు చేసినవాళ్ళని శిక్షించడం చేత కాక, పొరపాట్లు చేసిన వాళ్ళమీద పగ తీర్చుకుంటారు మీరు

నేను కాపీ చేశాననీ, తప్పు చేశాననీ రిపోర్టు చేశారు మీరు.

డిబారు చేశారు నన్ను.

చేజేతులా ఒక విద్యార్థి జీవితం నాశనం చేసిన గురువులు మీరు !

మిమ్మల్ని ఏమనాలో తెలియడంలేదు నాకు,

ఎలా అర్ధం చేసుకోవాలో అంతకంటె బోధపడ్డంలేదు నాకు

ఆఖర్న ఒక్క మాట మేష్టారూ! ఒక ఏడాదే నా చదువు ఆగిపోయేది ఒక ఏడా దితో నా శిక్ష పూర్తి అయిపోతుంది.

కాని నీడాది ఏడాదీ యీ శిక్ష మీకు పడుతూనే ఉంటుంది.

అందర్నీ ఒకలా చూడలేని, అన్ని పరిస్థితుల్లో ఒకేలాగ ప్రవర్తించలేని మీ అసమర్ధత ఎల్లకాలం మిమ్మల్ని వేధించక మానదు

నాకు కాదు మీరు జవాబు చెప్పవల సింది.

దీనికి మీకు మీరేం జవాబు చెబుతారు!? ●

# మిని బుక్కులు శ్రీశ్రీ

## విరసం - ౧

విరసం ప్రణాళిక
విప్లవ సాహిత్యప్రకాశిక
నవయువర్తక ప్రవేశిక
భవితవ్య భవ్యప్రతోశిక
అరసానికి కొరకరాని ప్రహేళిక

## విరసం - ౨

విరసం విరోధుల నోళ్ళు
వాంతి చేసుకుంటున్నాయ్ కుళ్ళు
కదులుతున్నాయ్ వాళ్ళ కీళ్ళు
నెమకుతున్నాయ్ నెరసులకై వాళ్ళ కళ్ళు
పరుగిడుతున్నాయ్ వాళ్ళగుండెల్లో రైళ్ళు

## విరసం - ౩

విరసం అరణ్య కంఠీరవాలు
వేస్తున్నాయ్ బస్తీమీద సవాలు
వీస్తున్నాయ్ ఝుంఝూ నిలాలు
పదునుపెట్టి కత్తుల కలాలు
తెరుస్తున్నాయ్ వెలుతురుకవాటాలు శతాధికాలు

## అగ్నిపరీక్ష

చెయ్యాలి పరిస్థితుల సమీక్ష
వహించాలి దీక్ష
వర్గ శత్రువులపై కక్ష
పరిష్కరించి సమస్యలు సవాలక్ష
విధించాలి వెధవలకు తగ్గ శిక్ష

## చిత్తశుద్ధి

విప్లవ కారుల విధ్వంస
బీభత్స కాండకు నా ప్రశంస
అదెన్నడూ కానేరదు హింస
అది నూతన చేతనా రిరంస
మానవ మానస మానసరోవర హంస

## సుజలాం, సుఫలాం

సామ్య వాదం
ఈ నాటి వేదం
అందరిలో మారుమోగే నినాదం
అందరికీ అందిస్తుంది మోదం
అది సఫలం సుఫలం శ్రీదం

## పిలుపు

కదన విహారానికి కత్తి పట్టు
కార్మిక వీరుడవై సుత్తి తిప్పు
ప్రగతి విరోధుల భిత్తి కొట్టు
సామ్య వాదాన్ని నీ గుండెల్లో హత్తి పెట్టు
సమానతా సదాశయాన్ని నెత్తి కెత్తు

## మలుపు

సమైక్య సందేశం చాటి
ఈ నాటి
ఖండాంతర సహస్రకోటి
కష్ట జీవుల విజయధాటి
విజృంభిస్తోంది సరిహద్దులదాటి

# శ్రీ ప్రాస శ్రీ క్రీడలు

ట్టి కవికి

## మొట్టి కాయలు

ఏఁ వి ట్రోయ్ పొట్టి కవీ
ఎందు కింత దూకుడు
ఎడా పెడా వాయిస్తా
ఎండిన నీ మూకుడు

నేల మునగ చెట్టెక్కగ
నిచ్చెన వేస్తావటగా
శ్రీ శ్రీ నే ఎదిరించే
ఎత్తుకి పెరిగా వటరా

బహువచనం లేదు సుమా
ఒకడే హంత భుక్కురా
ఎక్కడ నువు దాగున్నా
బైటి కీడ్చి మెక్కురా

నీ బతుక్కి విలువౌకటా
చిల్లి గవ్వ చేయవు
అంతకు వెయి రెట్లుర మా
వో అపాన వాయువు

ఎముకముక్క కొరుకుకుక్క
ఎంచు నరుని దేవునిగా
ఆరుద్రను కొలుతు వీవు
అతి మహాను భావునిగా

సినిమా ఎంగిలి మెతుకులు
సిద్ధాన్నం చేసుకో

దిగంబరుల ఊసెత్తక
తెలివిగ నోర్మూసుకో
నారాయణ రెడ్డి ముందు
నీ కత దిగదుడుపురా
పారాయణ చేయనేల
పాతది పరగడుపురా
సంధి రోమరాజుగాడి
సరుకు నీకు నచ్చిందా
పంది బురదనే గానీ
పన్నీటిని మెచ్చింటా
బడ బడ బెక బెక లాడే
నూతిలోని కప్పగా
చైనా దార్శనికత నీ
కేం తెలుసును చెప్పరా
ధనస్వామ్య సంస్కృతికే
దన్నుగ నిలిచావురా
దరిద్ర దేశం కోసం
తన్నుకపడి చావరా

[తెలంగాణా మహా కవి!

ఒరే అబ్బాయ్, తీవ్రమైన వర్గ విభజన జరుగుతున్న ఈ రోజుల్లో, నత్త గుల్లలన్నీ ఒక వైపుకి జరుగుతున్న ఈ కాలంలో ఎటువైపు నువ్వు మొగ్గు తావు? ఎవరిని తిడుతున్నావు? ఎవరిమీద జుగుప్స కలిగించ దలచుకున్నావు? ఏ వర్గం కొమ్ముకాయడానికి నిలుచున్నావు? కళ్ళున్న కబోదులెవరో నువ్వే తేల్చుకో. సామ్యవాదాన్ని ఏవగించుకునే వాళ్ళని నే నర్థం చేసుకోగలను ఎటొచ్చీ సామ్యవాదం కావాలంటూ, ఆచరణలో వెన్నుపోట్లు పొడిచే వాళ్ళతోనే నాపేచీ! అబ్బీ! చీనా అంటే మనకెందుకురా భయం. భయపడే వాళ్ళని భయపడనీ! మళ్లీ కలుసుకుందాం!

శ్రీ. శ్రీ.]

అదే యిల్లే సీకటి సీకటి గున్నాదే ఆ యిల్లు. బుడ్డిదీపం ఉన్నాది సూడూ దాని పక్కయిల్లు, అని గుర్తులు చెప్పి, చేత్తో చూపి 'తెలిసిందా?' అని అడిగి కొండడు తెలిసిందని చెప్పిం తర్వాత తనదారిని వెళ్ళిపోయాడు ఆ పెద్దమనిషి కొండడుతో పాటు బస్సు దిగాడు. వూరుకు దారితెలీదు అని వెతుక్కుంటుంటే ఆ వూరిమనిషే కలవడం-దాంతో ఆచిక్కు విడిపోయింది కొండడుకి ఆ మనిషిమీద గౌరవం కలిగింది.

గొడుగు ఉన్నా తడిసి పోతున్నాడు. గాలికి గొడుగు చేతిలో వూగిపోతున్నది

కొండడు ఆ చెప్పిన యింటి ముందు కొచ్చి ఆగాడు ఇంట్లో మనుషులెవ్వరూ కనిపించలేదు లోపల దీపం మసక వెలుతురు కనిపిస్తున్నది

'సాయిత్తిరీ' అని పిలిచాడు బయట వీధిలోంచి.

'వోరు?' అని బయట అరుగు చీకటి. లోంచి ఎవరో అడగడం వినిపించింది ఎంత పరిశీలనగా చూసినా మనిషి ఆ చీకట్లో కనిపించలేదు.

'నీను సాయిత్తిరి అన్నని' అన్నాడు.

వాన చప్పుడుకి వినిపించినట్టులేదు

'వోరు?' అని గట్టిగా మళ్ళీ.

మునలమ్మ సాయిత్తిరి అత్త అయుంటుందనుకున్నాడు కొండడు.

'సాయిత్తిరి అన్నని.'

'జగ్గన్నవా నాయనా. మాట గురుతు పట్లేకపోయినాను. రా నాయినా రారా. సాయిత్తిరి పొరిగింటి కెల్లింది. వస్తాది కూకో వోన వాకచే వోన తడిసిపోయి నావా.'

'గొడుగున్నాది గాని — కొడుగాగు తాదా యీ వానకి' అన్నాడు కొండడు. బురదకి పాడవుతాయని పట్టుకున్న చెప్పులు కిందుంచాడు గొడుగు ముడిచి చూరుకు వేలాడదీసాడు. చేసంచి గోడ దగ్గర పెట్టాడు,

'కూకో నాయినా మీ అమ్మా అయ్యా అంతా కమ్మగున్నారా?'

'ఆఁ ఆఁ కమ్మగున్నారత్తా'

'నీ పిల్లలూ-నీ పెళ్ళమూ.'

'జగ్గన్నని కాదత్తా సిన్నోడిని.'

'సిన్నోడువా జగ్గన్న వనుకున్నాన్నాయిసా మీ అన్నా వొదిన పిల్లలూ— కమ్మగున్నారా నాయినా,'

'అంతా కమ్మగున్నారత్తా'

కొండడు చెల్లెలికోసం నెతుకుతున్నాడు చీకటి. ఎవరూ వీధుల్లో కనిపించటంలేదు. ఇళ్ళల్లో ఎర్రఎర్రగా మసక దీపాల వెలుతురు. యిరుకు యిరుకుగావున్న తాటాకుల యిళ్ళు

'దేశంనించి ఎన్నడొచ్చినావునాయినా.

కొండడు పంచె చెంగు పిండుకున్నాడు చేసంచిలోని తువ్వాలు తీసి వొళ్ళు తుడుచుకున్నాడు జేబులో బీడీకట్ట, అగ్గిపెట్టెతీసి బీడీ వెలిగించాడు నోటినిండా పొగపీల్చి వొదిలాడు.

'నాల్రోజు లయిందత్తా. సోమోరం నాదొచ్చినా' అన్నాడు

వానలో తడుస్తూ సాయిత్తిరి నీళ్ళ కడవతో వచ్చింది. గడపలో చీకటిలో బీడీ తాగుతున్న మనిషి కనిపిస్తే పోల్చుకోలేక పోయింది, 'సాయిత్తిరీ' అని కొండడు పిలిస్తే 'పిన్నన్నా' అని నిలబడిపోయింది 'మా పిన్నన్నొచ్చి నాడత్తా' అని చెప్పి లోపలికెళ్ళి ముంతతో నీళ్ళుపట్టుకొచ్చింది. 'కాళ్ల కడుక్కోరా' అని ముంతఅందించి 'మా పిన్నన్నత్తా దేశం నించొచ్చినాడు' అని అత్తకి మరొకసారి చెప్పింది

సాయిత్తిరి వొళ్ళంతా తడిసిపోయింది ఆ యింట్లో ఓమూల పొయ్యివుంది ఆ పొయ్యికి దగ్గరలోనే పెరటి ద్వారం. ఆ వెనక చిమ్మచీకటి సాయిత్తిరి ఆ ద్వారం దగ్గర సుంచుని చీర పిండుకుని వచ్చి గోడకి ఆరగట్టిన చీరతీసి మార్చుకుంది.

కొండడు కాళ్ళు కడుక్కుని లోపలి కొచ్చాడు తూరుపు గోడకాడ పాప కని పిస్తే వెళ్ళి పాపదగ్గర కూచున్నాడు.

'నీ కూతురు తొంగొని ఎంతసేప యింది. లేస్తాదా' అని 'ఒక గుడ్డేనా కప్పి నావు కాదు సల్లేదా!' అన తన తువ్వాలు కప్పబోయాడు. తడిసిందని ఆ పక్కనే పడున్న గుడ్డకప్పాడు పాపమీద కొండడు.

సాయిత్తిరి అమ్మా అయ్యా సంగతు లడిగిన తర్వాత 'పెద్దన్న ఎలాగున్నారా ఆ మద్దిన పోలీసోళ్లు కొట్టినారట' అంది.

'బాగున్నాది అప్పుడప్పుడు ముక్కు నించి నెత్తురు పడుతున్నాది గుండిమీద కోడిగుడ్డు పట్టేసినారు యీపంతానొప్పట. యింకా తగ్గలేదు '

సాయిత్తిరి పొయ్యి వెలిగించింది. మంట అంటుకోలేదు ఇంటినిండా పొగ. కళ్ళు మండుతున్నాయి. కొండడు పొగ భరించలేక బయటికొచ్చాడు. బీడీ అయి పోయింది పారేశాడు

అడుగులు వప్పుడు, బీడీ పొగవాసన ముసలమ్మకి తెలిసింది.

'నాయినా నీకాడ సుట్టఉంటియ్యి' ఆ చలికి చుట్ట అట్టే పొగ పెట్టుకోవాలనిపిం చింది ముసలమ్మకి.

'సుట్ట లేదత్తా. పూర్ల దొరుకుతాయా కొనితెస్తా' అన్నాడు

పొయ్యి వెలిగింది. లోపల పొగ తగ్గింది

'చెల్లీ పొయ్యి ఎత్తిరించినావు కదా. నాకు ముందు చానీళు కావాల ఒకపక్క పెట్టు' అన్నాడు

సాయిత్తిరి వెతుక్కుంటున్నది టీ పొడుం లేదు పాలులేవు బెల్లమయితే కొంచెం ఉంది మేష్టరు గారింటికి వెళ్తే దొరుకుతాయి, కాని వాన ఈ చీరకూడా తడిసిపోతే యింక మార్చుకోవటానికి ఏం లేదు పగలంతా కూలికెళ్ళి పొలంలో తడిసింది ఇంటికొచ్చి వంట చేయబోతే నీళ్ళు లేవు. పక్కింటికి వెళ్ళి నీళ్ళు తెచ్చి లోపల మళ్లీ తడిసింది

'చాపత్తీ ఉన్నాదా' అడిగాడు కొండడు

సాయిత్తిరికి అర్ధంకాలేదు కొండడు అస్సాం వెళ్ళిపోయాడు రెండేళ్ళకిందట. అక్కడికెళ్ళిన తర్వాత వాడిమాట మారి పోయింది సాయిత్తిరి మారు పలక్క పోయేసరికి తెలిపి కొండడు 'టీ పొడుం ఉన్నాదా' అన్నాడు

సాయిత్తిరి పొయ్యి రాజుకోవటానికి చేటతో గాలివీస్తున్నది కొండడు తన చేసంచి పట్టుకుని వచ్చి పొయ్యిదగ్గర కూచున్నాడు. 'లెగు నేను సూస్తాను' అని చేట చెల్లిలి చేతిలోంచి తీసుకున్నాడు.

మంట రాజుకుంది.

'ఈ సెక్కమీద కూకో' అని చిన్న బల్లచెక్క అందించింది సాయిత్తిరి.

'నీవూ కూకో' అని చెల్లెల్ని కూచో బెట్టాడు కొండడు.

సంచిలోంచి బిస్కెట్ పాకెట్లూ, మిఠాయి పొట్లమూ, తేయాకుమూటఒక్కొక్కటే తీసి బయట పెడ్తున్నాడు. సాయిత్తిరి టీకోసం నీళ్ళు పొయ్యిమీద ఓ పక్క పెట్టింది. అన్నంకోస ఎసరు ఇంకోపక్క పెట్టింది. కూచునే అన్నీ చేస్తున్నది

కొండడు తేయాకు మూట విప్పాడు. పెద్ద పెద్ద ఆకులు నల్లగా 'ఇది సానా మంచాకు దొరలు తాగుతారు' అని తను అస్సాంనించి చెల్లెలుకోసం తెచ్చిన తేయాకుని చూపాడు. అంత మంచాకు సాయిత్తిరి చూడలేదు అంత ఎక్కువ

సాయిత్తిరి ఆకు వాసన చూసింది. 'కమ్మగున్నాది' అంది

'చీనీ ఉన్నాదా.'

'పంతులమ్మ కాడికెల్లి తెస్తాను '

'పోనీ బెల్ల మున్నదా '

బెల్లమున్నాదని తెలిపి ఇంకేం వొద్దన్నాడు. మరొక బీడీ తీసి కట్టెపుల్లతో వెలిగించుకున్నాడు.

"బావ ఎప్పుడన్నా వొస్తన్నాడా?' చెల్లెలు ముఖంలోకి చూసి అడిగాడు.

సాయిత్తిరి మొగుడు వీరేశు నక్సలైట్లలో కలసిపోయాడు. సంవత్సరం పైబడింది వెళ్ళిపోయి. మరి ప్రజలేమో వచ్చిపోతున్నాడు మేం చూసామంటే

మేం చూసాం అనుకుంటున్నారు అడిగితే నిజమెంతో అబద్ధమెంతో సాయిత్రి చెబుతుందని అడిగాడు.

'రాలేదు '

'కూతురు పుట్టిన తరాత కూడా '

'ఊహూ!'

'మరి దొరికిన నక్స్ లైటునల్లా పోలీసోళ్ళు కాల్చేస్తున్నారట కదా,''

'ఆఁ.'

'బావ బతికే ఉన్నాడా సాయిత్రీ.'

'బతికున్నాడు.' అని చెప్పింది

బీడీ పొగ వాసనకి మొగుడు గుర్తొచ్చాడు సాయిత్రికి

పొయ్యి మండుతున్నది. ఆ మంటల ఎర్ర రంగు పడి వాళ్ళిద్దరి ముఖాలు మెరుస్తున్నాయి ఓ పక్క వానగాలి చల్లగా. పొయ్యి దగ్గర మంట వెచ్చదనం మరొక పక్క చూరునించి. జారుతున్న వాన నీళ్ళ చప్పుడు. పెరటనించి వరదనీరు పారుతున్న గలగల. పొయ్యి మీద సల సల నీళ్ళు కాగుతున్నాయి. టీ వాసన బెల్లం తీసి మరుగుతున్న టీ నీళ్ళలో వేసింది. సాయిత్రి. ఆ టీ వాసనకి మళ్లీ మొగుడు మతి బడ్డాడు తెల్లారక ముందే డికాషన్

చెయించి తాగి పనిలోకి వెళ్ళిపోయేవాడు.

కొండడు డికాషన్ వడబోసాడు. నల్లగా, బెల్లం వాసనతో టీ అత్తకిచ్చి వస్తానని ఒక గ్లాసుతో తీసుకెళ్ళింది సాయిత్తిరి బీడీ పెరట్లో పారేసి మిగిలిన టీ తనకీ చెల్లెలకీ గ్లాసుల్లో సర్దాడు.

చెల్లెలు చాలా పెద్ద మనిషి అయి పోయినట్టనిపించింది కొండడికి సాయిత్తిరికి పెళ్ళికాక పూర్వం అస్సాం వెళ్ళి పోయాడు మళ్ళీ ఇప్పుడే రావడం. ఈ రెండేళ్ళల్లో సాయిత్తిరి తల్లి అయింది ఒక యింటాకి పెద్ద మనిషి అయింది. ముఖంతో మొద్దు తనం ఇప్పుడే లేదు. తేటు తేలింది.

టీ చప్పరిస్తూ చెల్లెల్ని చూస్తున్నాడు. వానకి బొట్టు తడిసిపోయి చెరిగిపోయింది జుత్తు తడిసిపోయింది, నుదుట మీద చిన్నప్పుడు తగిలిన దెబ్బల మచ్చలున్నాయి

అలా చెల్లెల్ని చూస్తుంటే దుఃఖ మొచ్చింది.

వేరే చట్టిలో నీళ్ళుపోసి పొయ్యి ఖాళీ అయిన పక్క పెట్టింది. బియ్యం కడిగి రెండో పక్క కాగిన ఎసరులో పోసింది. చింతపండు తెచ్చి నానబెట్టింది. తర్వాత సత్తు గ్లాసు నోటి దగ్గర పెట్టుకుని 'సిన్నన్నా, లగ్నం ఎప్పుడనుకుంతన్నార్రా' అని టీ ఒక్క గుక్కమింగింది.

'నీ నిప్పుడొచ్చినాను ఏనికని? అయ్య నీకు తీసుకొన్రమ్మని తోల్నాడు.

'ఎప్పుడు లగ్నం.'

'బుదారం రాతిరి' కొండడు టీ చప్పరిస్తూ మింగుతున్నాడు.

' బుదోరమా' అని ఆశ్చర్యపోయింది సాయిత్తిరి

పెళ్ళికి యింకా నాలుగుదినాలే మధ్యన వెళితే ఇంటి దగ్గర అత్త దానికి కళ్ళు కనిపించవు మొగుడు వెళ్ళిపోయిన తర్వాత రెండుసార్లు మాత్రమే వెళ్ళింది. తండ్రి జబ్బు పడ్డాడని తెలిసినప్పుడొక సారి వదిన నీళ్ళాడిందని కబురొచ్చినప్పుడు రెండోసారి.

'అయితె సిన్నన్నా మల్లా దేశం ఎలి పోతావా పెళ్ళయిన తరాత ఇక్కడే వుండి పోతావా!' అడిగింది సాయిత్తిరి టీ తాగుతున్నది

'ఇక్కడుండి ఏమిటి తింతాను. అక్కడికే ఎలిపోతాను. ఎప్పుడో ఏడాదికో ఆర్నెల్లకో వచ్చి ఎత్తాను.'

'సాయిని తీసికెల్లి పోతావా నీతోటి?'

'పెళ్ళయిన్తరాత అదిక్కడ పనికి మల్లా ఎల్లిరావాలంటే వొందరూపాయి లవుతాయి కేవుకి '

సాయి సంబంధం కొండడుకి అవుతుందని అనుకోలేదు సాయి తండ్రికి గొర్రెల మంద ఒకటి వుంది నాలుగు గేదెలున్నాయి వాడికి అప్పుల్లేవు. వాడి కొడుకు లెవ్వరూ కంబార్లుకారు. ఒకడు గేదెలు చూసుకుంటాడు. ఒకడు కూలి పనులు అనీ చేసుకొంటాడు. సాయితండ్రి గొర్రెల మంద చూసుకుంటాడు.

సాయి త్రిరి తండ్రికి ఒక చిన్న ఇల్లు రెండు మేకలు తప్ప ఆస్థిలేదు. రెండేళ్ళ కిందటిదాకా జగ్గన్న ఊళ్లోని ఒక రైతు దగ్గర కంబారితనం చేసాడు సాయి త్రిరి తండ్రి ఇప్పటికీ కంచారోడే బుగత కొట్టా డని కొట్టి కొట్టి చంపేస్తాడని భయపడే కొండడు అస్సాం వెళ్ళిపోయాడు అంత తేడా వుంది కూడా ఈ సంబంధం కుదిరిం దంటే దానికా్కరణం కొండడికి ఉద్యోగం ఉండడమే కర్రలు కోసే మిష న్‌లో పని చేస్తున్నాడు నెలకి పదోపాతికో ఇంటికి పంపిస్తున్నాడు పైగా సాయికి వచ్చిన రెండు మూడు సంబంధాలు కూడా రెండో పెళ్ళి నంబంధాలు వచ్చాయి వాటి కంటె కొండకు సంబంధం చాలా మేలు ఇవన్నీ చూసి సాయిని ఇవ్వటానికి ఒప్పు కున్నారు

'సాయి శానా పెంకిదిరా చిన్నన్నా అప్పుడు ఒదిన నీళ్ళాడిందని కవురు తెలిస్తే ఏల్నాను యింకా ఈ సమ్మందం ఊసులేదు. ఏమయింది నాన్నా. పెద్దరైతు పిన్నతమ్ముడు యిసాకపట్నంంతో సదువు తన్నాడట అదొకసారి సెరుకుతోటకాడ ఎదురయి సెయ్యి పట్టినాడట—' అని సాయి కబుర్లు చెల్లెలు చెబుతుంటే కొండ డుకి చాలా ఇష్టంగా వుంది. ఆ వూర్లో పెద్దరైతులు రాబందుల్లాంటి వాళ్ళు ఆ సంగతి కొండడుకి బాగా తెలుసు. వాళ్ళ చేతుల్నించి ఆడవాళ్ళు తప్పించుకోవడం అంటే అది పెద్ద సాహసమే. పద్మనాభంకి పెళ్ళయిన వారం దినాలకే వాడి పెళ్ళం నూతిలో నడిచచ్చి పోయింది అప్పుడు అంతా కరణం పేరు చెప్పుకున్నారు.

పొయి ముందు కూచుని సాయి త్రిరి పొయిలో తొక్కు పిడకలు పెట్తున్నది. అన్నం పొయి మీద వుడుకు తున్నది. ఓ పక్క వులుసు మరుగుతున్నది.

కొండడు టీ తాగి మళ్లీ బీడీ వెలిగిం చాడు చలిపోయి పొయివేడికి చిరుచెమట పట్టింది నుదుట చొక్కా తీశాడు. రెండేళ్ళ లోనూ వాళ్ళు బాగా గట్టిపడింది. మీసాలు నల్లబడ్డాయి, చిన్న జుత్తుతో క్రాఫ్ అందంగా వుంది

ఆ మధ్య సాయి త్రిరితో ఎవరో అన్నారు 'నీ మొగుణ్ని ఫలానా వూళ్లో చూశాను. ముందు లాగ వున్నాడను కున్నావా మనిషి గట్టిపడ్డాడు ఛాతి మూర దున్నాది' అన్నని చూపినప్పుడు ఆ మాటలు గుర్తు కొచ్చాయి మొగుణ్ని చూడాలని ఎప్పుడూ అనుకుంటుంది. మేష్టరుగారితో చెపుతుంది. ఆళ్ళెవళ్ళన్నా తెలిస్తే చెప్పండి మేష్టరూ అని మరి మేష్టరుకు వాళ్ళు కలిసారో లేదో. మేష్టరు చెప్పాడో లేదో ఏమీ తెలీదు.

వాన తగ్గలేదు. గొడుగు నేసుకుని మేష్టరుగారి భార్య వచ్చింది. 'సాయి త్రిరీ నీ కూతురు నిద్ర పోతున్నదా' అని తిన్నగా ఆ పాప దగ్గరికే పోయి ఎత్తు కొచ్చింది. పాపతో 'మీ అమ్మొచ్చిందే లే' అని కొత్త మనిషి పొయి దగ్గర కూచుని

ఉంటం చూసి ఆగిపోయింది.

'మా పిన్నన్న' అంది సాయిత్రిరి.

కొండడు లేచి బయటి కొచ్చాడు. మునలమ్మ చుట్ట సంగతి గుర్తు కొచ్చింది వెళ్ళి తేవాలంటే ఎక్కడ దొరుకుతాయో ఏమో తెలీదు. వాన ఆగకుండా కురుస్తు న్నది. ఎరిగిన మనిషి ఎవరూ లేరు.

మేష్టరుగారి భార్య పాపకి రొమ్ము కుడిపింది తల్లిపాలు పాపకి చాలవు మేష్టరుగారి భార్య ఎక్కువ రోజూ ఇచ్చి పోతుంది. ఉదయం ఓసారి మధ్యాహ్నం ఓసారి ఆ పాలే లేకపోతే పాప బతుకు కష్టమయ్యేది మేష్టరుకూడా వారానికీ పదికీ ఓసారి వచ్చి చూసి పోతాడు ఇంట్లో కష్టంగా వుంటే సాయం చేస్తాడు. వూళ్లో పెద్దమనుషులకి ఇది కంటగింపుగానే ఉంది. కాని ఏం చేయలేదు ఏం చేస్తే నక్స్ లైట్లు వచ్చి తలకాయకోసి వేలాడగట్తారో అని భయం పైగా ఆ మేష్టరుకి ఆ తాలూకా ఎమ్మెల్యేతో బంధుత్వంఉన్నాయి ఈ సందర్భంలో ఒకసారి ఆ మేష్టర్ని పోలీసుల చేత అరెస్ట్ చేయించారు భూస్వా ములు ఎమ్మెల్యే మరి కొందరు పెద్దలు కలిగించుకున్న తర్వాత ఇంటరాగేషన్ వదిలేసారు మరొక సందర్భంలో మళ్లీ మేష్టర్ని పట్టించాలని ఆ వూళ్లో కొందరు భూస్వాములు పోలీసులకి పెద్ద మొత్తం లంచ మిచ్చి ప్రయత్నించారు. అంతలో పోలీసులకీ భూస్వాములకీ బెడిసింది. భూస్వామి కోడలికి పోలీసులు మాన భంగం చేసారని అందరూ చెప్పుకున్నారు వెంటనే సుమారు ఐదారువేల రూపాయిల వరకు ఖర్చు పెట్టి కేంప్ తీసేయించారు ఆ వూరు మునసబు.

మేష్టరు భార్యకి మొదటి కాన్పు నాలుగు మాసాలు కొడుకు. ఆమె చూస్తే పెద్ద వయసు మనిషిలాగ కన్పిస్తుంది. కనీసం ముప్పయ్యేళ్ళే నా ఉండొచ్చు. చామనచాయ మనిషి. సన్నగా పొడుగ్గా. పెద్ద కళ్ళు జుత్తు జడేసి ముడి చుట్టు కుంది. పట్నం మనుషుల చీరకట్టు

'మా సిన్నన్నకి వెళ్ళి మేష్టరమ్మా' అంది.

'ఎప్పుడు. నీ వెళ్తున్నావా'

కొండడు కలిగించుకుని 'దాన్ని తీసి కెళ్లానికే నీ నొచ్చినానండి' అన్నాడు

అన్నం ఉడికింది గంజి వార్చటానికి వెళ్ళింది సాయిత్రిరి

బీడీ పొగ వాసనకి ముసలమ్మకి చుట్ట గుర్తుకొచ్చింది.

నాయినా నీ పేరేమిటన్నావ్' ముస లమ్మ అడిగింది.

'కొండడు'

'కొండడా. నోరంత సేదుసేదుఁ గున్నాది నాయినా. సుట్ట అగిడినానని ఏమను కోకు. మిల్లు డైవేరు అప్పుడప్పుడొచ్చి సుట్ట లిస్తాడు. ఈ మద్దిన రాలేదు.' అని చెప్తున్నది.

చుట్ట కావాలి అని అడిగినట్టుగా ఉన్నాయి ఆ మాటలో. కాని తెస్తానని




చెప్పాడు ఆ మాట గుర్తు చేస్తున్నట్టుంది ముసలమ్మ

'అత్తా యీ వూళ్లో ఎక్కడ సట్ట ద్దొరుకుతాయో తెలుసునా' అడిగాడు. గొడు గేసుకుని వెళ్ళి తీసుకురావొచ్చని.'

'ఎదురు వాసలో నాలుగిళ్ళు దాటితే ఆ పెంకుటింట్ల దొరుకుతాయి నాయినా' అని చెప్పింది.

గొడుగు తీసి వీధిలోకి వెళ్ళాడు కొండడు. దగ్గరే పెంకుటిల్లు.

కొండడు వీధిలో ముందుకు వెళ్తుం డగా తాటి గొడుగు తలమీద పెట్టుకున్న ఓ కుర్రాడు పరుగూ నడకతో వచ్చాడు, తాటి గొడుగు గోడకానించి పెట్టి లోపలి కెళ్ళాడు. మేష్టరు భార్య ఇంకా పాపకి పాలు పెట్టున్నది. సాయిత్రిరి పొయిదగ్గర కనిపిస్తే 'మీ యింటి కెవరేగా వొచ్చినారా సాయిత్రిరప్పా.' దగ్గరికెళ్ళి చిన్నగొంతుతో అడిగాడు.

వాడు వూరుకు తూర్పుగా ఉన్న రైస్ మిల్లులో కళాసీ. ఆ మిల్లు పక్కనించి రోడ్డుకు పోయేదారి రోడ్డుకు అరమైలు దూరం. రోడ్డుమీద ఒక మైలు దూరంలో పోలీస్ కెంప్. మిల్లు దగ్గర ఆ సంగతి డ్రైవర్ చెప్తే వచ్చాడు. సాయిత్రిరి ఇంటికి నక్సలైటు వచ్చాడని, అది తెలిసి పోలీ సుల్ని పిలుచుకు రావటానికి ముగ్గుర్ని పంపారు పెద్ద మనుషులు, వాడు మిల్లు

దగ్గర్నించి దొంగతనంగా అడ్డుదారిని వచ్చాడు. మళ్లీ తొందరగా వెళ్ళిపోవాలి. మిల్లుకి తీరికలేదు. నెలదినాలుగా పని రాత్రీ పగలూ ఉంటున్నది. డ్రైవర్ చెప్తేనే వచ్చాడుగాని తొందరగా వెళ్ళకపోతే మళ్లీ తిట్తాడు.

'ఎవరూ మా సిన్నన్న తమ్ముడూ. అస్సాంలో ఉన్నాడన్నాను సూడూ ఆడు. గడపలోన నిలబడున్నాడు సూడూ ఆడు. ఆడికి, పెళ్ళి. తీసికెలడానికి కొచ్చినాడు అయ్యతో త్తే'

కళాసీ నున్నగా గుండ్రంగా నల్లగా గుండురాయిలా ఉన్నాడు.

తల గుండు కొట్టించాడు. భుజానికి తాయెత్తు కట్టాడు. చిన్న కాకి నిక్కరు తప్పించి వొంటిమీద వేరే గుడ్డలేదు.

'అదికాదు సాయిత్తిరప్పా. పోలీసుల్ని పిలిపికి రాడానికి ఎల్నారు. మీ యింటి కొచ్చారా ఎవరేనా'

వాడికి గడపలో ఎవరూ కనిపించలేదు. మరేమో గడపలో సిన్నన్న ఉన్నాడం టుంది సాయిత్తిరి. తన దగ్గర దాచుతున్న దేమోనని మళ్ళీ చెప్పాడు

'నిజం తమ్ముడూ. మా సిన్నన్న దేశం నించి వొచ్చినాడు పెళ్ళికి'

'మరేం బయంలేదా'

సాయిత్తిరి మాటాడలేక పోయింది,

'మరెక్కడన్నా వున్నారా'

సాయిత్తిరి ఏం చెప్పలేక పోయింది. కాలుస్తున్న ఉప్పుచేప మాడిపోతున్న వాస నకి నిప్పుల్లోంచి చేపని తీసింది.

'పోలీసులయితే ఎలివొస్తారు. నీ నెలి పోతా' మేష్టరుగారిని కలిపి ఎల్లిపోతాను' అని ఇంట్లో మనుషులెవర్నీ చూడకుండా తాటిగొడుగు అందుకుని వానలోకి వెళ్ళి పోయాడు.

సాయిత్తిరి మేష్టరమ్మకి చెప్పింది ఇంకా పాలు పూర్తి కాలేదు. పిల్ల యింకా చీకుతూనే ఉంది. పిల్లని సాయిత్తిరికిచ్చి మేష్టరమ్మ వెళ్ళిపోయింది.

కొండడు వచ్చి ముసలమ్మకి చుట్ట ఇచ్చాడు. అగ్గిపెట్టి తీసి ముసలమ్మ చుట్ట ముట్టించాడు. ముసలమ్మ చుట్టపొగ నోటి నిండా బొక్కినోటితో పీల్చి 'కమ్మగా సుకంగా బతుకునాయానా' అని దీవెన్లిచ్చింది. ఆ అగ్గిపుల్ల వెల్తురులో ముసలమ్మ ముడ తల ముఖం కవిపించింది.

సాయిత్తిరి బయిటికొచ్చి చూసింది. కొండడు ముసలమ్మకి చుట్టలు యిస్తు న్నాడు.

'రాతిరికి ఒక సుట్టయితే సరిపోతాది నాయినా. ఒకటైతె సరి. ఇవి నాకు వారం పదిరోజులొస్తాయి.

అత్త చెప్తున్న మాటలు విన్నది.

అన్నతో ఆ సంగతి చెప్పాలో మానాలో తెలీలేదు చివరికి సాయిత్తిరి తనలో దాచు కోలేక పోయింది చెప్పింది. సాయిత్తిరికి ఒక్కసారి చాలా ఆలోచనలు ముసురు కొచ్చాయి. నిజంగానే మొగుడువచ్చి ఎక్కడన్నా ఎవరింట్లోనన్నా ఉన్నాడేమో.

Kleertone

# క్లీర్‌టోన్- సాటిలేని విద్యుత్ ఉపకరణాలు

'క్లీర్‌టోన్' రకరకాల విద్యుత్ ఉపకరణాలకు పెట్టింది పేరు నాణ్యమైన ఈ ఉపకరణాల వెనుక, ఏళ్ళ తరబడి సాధించిన తయారీ అనుభవం ఉన్నది అందుకే, దేశమంతటా వేల కొద్దీ గృహిణులు 'క్లీర్‌టోన్' ఉపకరణాలనే వాడుతున్నారు.

మీ సొమ్ముకు తగ్గ విలువగల వస్తువులు కావాలంటే, 'క్లీర్‌టోన్' విద్యుత్ ఉపకరణాలనే కొనండి ఈ ఉపకరణాల సర్వీస్ కొరకు దేశమంతటా 1,500 కు పైగా క్లీర్‌టోన్ డీలర్లు విస్తరించిఉన్నారు




నేషనల్ రేడియో & ఎలెక్ట్రానిక్స్ కంపెనీ. లిమిటెడ్ (జనరల్ రేడియో & అప్లయన్సెస్ డివిజన్) బొంబాయి . ఢిల్లీ . కలకత్తా మద్రాస్

ULKA.KL.3.70

రమ్మని చాలాసార్లు కబురు చేయమని మేష్టరుతో చెప్పింది. చూసిపోవాలని వచ్చా దేమో. లేక ఇంకెవర్నన్నా పంపించాడో ఇంకెవరన్నా వచ్చారో. మేష్టరుగారి దగ్గరి కెళ్తే చెప్తే ఏం చేయాలో తెలుస్తుంది వెళ్ళాలంటే ఈ లోపలే వస్తారేమో.

ఆ సమయాన సాయిత్తిరికి పిన్నన్న కూడ నక్సలైట్ లాగ కన్పించాడు. వాడినే నక్సలైట్ అని తీసుకుపోతేనో. అట్లా ఎందర్నో తీసికెళ్ళారు. పెద్దన్నని తీసుకెళ్ళి కొట్టారు. ఇప్పుడు వీడినిమాత్రం విడుస్తారని ఏముంది తండ్రిమీద కోప మొచ్చింది సాయిత్తిరికి. ఎవర్తానో కబురువేస్తే సరిపోక పోయేదా. వాడినే ఎందుకు పంపించాలి.

పాపని కొండడు చేతికిచ్చి సాయిత్తిరి వానలో తడుస్తూనే వెళ్లింది. ఆ వీధిలో ఆ వాసకి పెరట్లోంచి దారిలేదు. పెరటి అందరి ఇళ్ళకూ దడులున్నాయి. ఆ దడుల వెనక వూరు వరదనీరు పారేవంతర ఉంది. ఆ వంతరనిండా ముళ్ళమొక్కలూ మురికీ ఎప్పుడూ వుంటుంది. ఇప్పుడు వాన నీరు పారుతున్నది నిండుగా.

కొండడుకి ఏమీ తోచటంలేదు. అన్నని కొట్టిన కథంతా పదేపదే గుర్తుకొస్తున్నది. అడవుల్లోకి తీసుకుపోయి చంపుతామని బెదిరించిన సంగతి, బావ ఎక్కడున్నాడో చెప్పమని భయపెట్టిన సంగతి గుర్తుకొస్తుంటే భయం భయంగా ఉంది. మళ్లీ అంతలోనే ధైర్యం. తను అస్సాంలో సామిల్లులో ఉద్యోగం చేసుకుంటున్నాడు తను పెళ్ళి చేసుకోవటానికొచ్చాడు. చెల్లెల్ని పిలవటానికి ఈ ఊరు వచ్చాడు. తను ఈ విషయాలు చెప్తే వాళ్ళు వెళ్ళిపోతారు. అనవసరంగా భయపెట్టుకోకూడదు. తనని తనే వోదార్చుకున్నాడు, పాపని ఎత్తుకుంటూ నిలబడ్డాడు. భయంకొద్దీ వీధిలోకి చూసాడు. వీధిలో ఎవరూలేరు. ఇంకా పోలీసులు రావటం లేదు.

పాపకీ కొత్త. ఏడవడం మొదలెట్టింది. నిద్రకూడానేమో. ఎంత బుజ్జగిస్తున్నా ఊరుకోదు. గొంతు చించుకుని ఏడుస్తున్నది. విసుక్కుని ముసలమ్మ దగ్గర పెట్టాడు. అక్కడా వూరుకోదు. బిక్కపట్టి ఏడుస్తున్నది.

సాయిత్తిరి అటికిడి లేకపోవడంతో 'సాయిత్తిరి ఎక్కడికెళ్ళింది నాయనా' అని అడిగింది ముసలమ్మ నోటిలోని అడ్డపొగ సుట్టతీసి.

కొండడు ఏమీ చెప్పలేక పోయాడు.

'యీ వానలో ఎక్కడికెల్లిందో' అని గొణుక్కుంది.

అప్పుడు అక్కణ్ణించి వెంటనే పారిపోవాలనిపించింది కొండడికి, కాని ఆ వూరు వాడికి కొత్త. పైగా అది రాత్రి. దానికితోడు వాన జోరున కురుస్తున్నది. వాడికి ఆ వూరు దార్లు తెలీవు, పొలాల్లో దమ్ము లవుతున్నాయి. పొలాలు నిండా నీళ్ళు గడ్డలూ, ఒరువులూ, తెలిసినవాళ్ళు కూడా ఎవరూలేరు, ఎటుపోతే రోడ్డో




తెలీదు, ఎటు ఏ డిక్కో. ఎటు తూర్పో ఎటు పడమరో. అకాశాన చుక్కల్లేవు. మెరుపులన్నా మెరవ్వు. సాయిత్రిరి కని పించదు ఎక్కడికెళ్లిందో. ఇదేమిటీ యిల్లు జైలులాగ చంపేస్తారా-అస్సాంలో తను పన్చేస్తున్న రంపపు మిల్లు. దాని మార్వాడి యజమాని అక్కడి దోస్తులు పూళ్ళో సాయి సాయి పెళ్ళి. బుదోరం పెళ్ళి సాయితో. చంపేస్తారా సాయిత్రిరేదీ-ఎక్కడన్నా పారిపోతే. వాన తగ్గదు.

పాప ఏడుపు అపదు' సాయిత్రిరి రాదు. ముసలమ్మ ఓదార్పు పాటలు.

సాయిత్రిరి వచ్చింది. ఎవరూరాలేదు ఒక్క సాయిత్రిరే వచ్చింది. సాయిత్రితో వస్తున్న మేష్టరు సగంలో ఆగిపోయాడు దూరంగా నల్లని మేఘంలాగ పోలీసులు. సాయిత్రిరి ఇంట్లో అడుగుపెట్టి పాపను అందుకునేసరికి పోలీసులు. టార్చిలైట్లు బురదలో అడుగుల చప్పుడు, కాకీదుస్తులు బరువైన తుపాకీలు, మెరుస్తున్న బాయి నేట్లు. ఒకరుకాదు ఇద్దరుకాదు పదిహేను ఇరవై మంది. వాళ్ళు మనుషులుకాదు వాళ్ళు ప్రభుత్వం. వాళ్ళు ఆయుధాలు. వాళ్ళు యంత్రాలు, వాళ్ళు క్రూరత్వం. వాళ్ళు జీతం రాళకోసం అమ్ముడుపోయిన వాళ్ళు.

ఆ అడుగుల చప్పుడులో పాప ఏడుపు వినిపించటంలేదు

బాయినెట్‌తో పక్కకి తోసింది సాయిత్రిరిని ఒక తుపాకి.

కొన్ని తుపాకులు బయట కాపలా కాస్తున్నాయి. కొన్ని తుపాకులు ఇంట్లో దూరి చుట్టు ముట్టాయి.

''నీను కొండడిని' అరిచాడు.

'నీను మా సెల్లెల్ని పిలడాని కొచ్చి నాను. బుదోరం నాడు నా పెళ్ళి' ఏడుపు

— — ఫ్లా.

'నీను అస్సాంలో సామిల్లుల ఉద్యోగం పేసికుంతన్నాను. నాకు' ఏడుపు గొంతుతో బతిమాలు కుంటున్నాడు కొండడు.

"నీను కాను. నీను కాను.'

ఆ భాషే అర్థం కానట్టు, ఆ ఘోషే వినిపించనట్టు ఉక్కు టోపీలు బాయినెట్లు మాటాడలేదు.

కొంత సేపటికి సాయిత్రిరి, పాప ఆ యింట్లో మిగిలారు. వచ్చిన ఉక్కుటోపీలు తుపాకీలు వెళ్ళిపోయాయి.

* * *

ఆ రాత్రే కొండడుని వూరుకు తూర్పువ మిల్లుదాటిన తర్వాత మర్రిచెట్టుకాడ పోలీసులు కాల్చేసారు. ఆ శవాన్ని పోలీసులు తర్వాత తీసుకుపోయారు. చంపేసినట్టుగా ఆ రాత్రే సాయిత్రిరికి తెలిసింది. వూళ్ళో జనం అందరికీ తెలిసింది. ఎవరు చేసిందో కూడా తెలిసింది. ఎందుకు చేసిందో కూడా తెలిసింది. ఈ రకంగాఎంత కాలం జరుగుతుందో మాత్రం ఆ వూళ్ళో జనంకి తెలీలేదు. ఇలా ప్రాణాలు తీయడాన్ని అహింసే అంటారో. న్యాయమే అంటారో చట్టమే అంటారో మాత్రం ఆ జనానికి తెలీదు. అలా ప్రాణాలు తీయడానికి ఉన్న అధికారాన్ని ప్రభుత్వమే అంటారో ప్రజాక్షేమమే అంటారో అరాచకాన్ని అరికట్టడమే అంటారో జనానికి ఎంతకీ అర్థం కాలేదు.

* * *

ఆ పగలు నాట్లు వేస్తుంటే పారంగవిరమ్మ, తవుడు, చిన్న అప్పలమ్మ, గరికమ్మ, నూకాలు, పెంటమ్మ, బోడి, సుబ్బి-ఎవరికి నోటికొచ్చిన తిట్లు వాళ్ళు-తిట్టున్నారు.

ఈ వూరిలోన రాకాసులెప్పుడు చస్తారో ఆళ్ళకి కాలం ఎప్పుడు నిండుతాదో. ఆళ్ళ తల లెప్పుడు ఇద్దలవుతాయో. ఆళ్ళ పెళ్ళాల పుస్తె లెప్పుడు తెగుతాయో. వాళ్ల కుదురు ఎపుడు నూత్తాదో, ఆళ్ళ తమ్ముళ్ళని ఎపుడు—

నూకాలు మధ్యలో అంది 'రావణబ్రమ్మ సచ్చినాడు యెంత' అని. *

---

## రైల్వే ఫిక్షన్

ఏదో రైల్వేస్టేషన్లో నోటీసుబోర్డు-'త్వరలో ఆగ్నేయరైల్వే టైంటేబిల్స్ దొరుకును'- అని చెప్పి పలకరిస్తున్నాది

ఎవరో దారేపోయే జోక్ జీవన్ రామ్ వెంటనే ఆ ప్రకటనకింద ఈ వాక్యాన్ని చేర్చేడు: 'ఈ అద్భుతకల్పనా సాహిత్యరాజానికై నేడే మీ కాపీలు రిజర్వ చేసుకోండి!'

ఉ్రనుకోని అవాంతర మెదురై— ఆ సాయంత్రం యింటివద్దనే ఉండిపోవలసి వచ్చింది శ్రీనివాసరావ్‌కి.

పేకాటకు అలవాటు పడిపోయిన ఆ ప్రాణికి-యింట్లో క్షణం గడవడం బహు దుర్భరంగా ఉంది.

విశాలమైన క్లబ్బురూములో-పదిమంది మధ్య - మేఘాలవంటి సిగరెట్ పొగల నడుమ-ధనాన్నీ. అంతకంటె అమూల్య మైన కాలాన్నీ పణంపెడుతూ-జూదంలో గడపడం అనే అలవాటుని నర నరాలా జీర్ణింప జేసుకున్న శ్రీనివాసరావ్‌కి—

చిన్నగదిలో — చేయడానికే పనీ లేకుండా-ఒంటరితనంలో - కాలం గడవక పోవడంలో ఆశ్చర్యం అణుమాత్రమైనా లేదు.

నిజం చెప్పాలంటే—

శ్రీనివాసరావ్ నివాసం శ్రీ రామా క్లబ్.

అతని విద్య పేకాట.

వృత్తీ, వ్యావృత్తీ-అన్నీ అదే.

అతని పరిజ్ఞానం - పేక ముక్కలకు పరిమితం.

అతనికి బాగా తెలిసేవి - సీక్వెన్సు, ఢంకా, రన్‌మోర్, ఆల్‌కౌంట్, కుదేలు .వగైరా సాంకేతిక పదజాలం.

అతనికి బాగా తెలియనిది-జీవితం.

అసలు తెలియనిది-కుటుంబం.

వృత్తిధర్మం కొందరిని అతిగా లొంగ దీసుకోడం మరీ అరుదుకాదు. అటువంటి వారి జీవితమూ, ఆలోచనలూ, సర్వస్వమూ ఆ వృత్తికే అంకితమై పోతాయ్. చివరన చూసుకుంటే ఫలితం - మంచిపేరు లేదా పిచ్చి-ఏదో ఒకటై వుంటుంది.

వృత్తికంటె వెయ్యిరెట్లు ఆకర్షణీయ మైనది వ్యసనం.

దీని ఆకర్షణలో పైశాచిక శక్తి విప రీతంగా ఉంటుంది.

మనిషిని వెనుదిరిగి చూసుకోనీయ కుండా-పూర్తిగా-ఊహలుసాగనీయకుండా ఉక్కిరి బిక్కిరి చేయగలిగే పట్టుదారాల ఉరిత్రాడు వ్యసనం.

వ్యసనపరులు సాధారణంగా జీవితం పట్ల గ్రుడ్డివారుగానే మిగిలిపోతారు. అలా కాకపోతే వాళ్ళకు బ్రతుకుపట్ల పుష్కలంగా ఉండేవి భ్రమలు. వొట్టి గాలిమేడల జీవితం అవుతుంది వారిది.

ఇన్నాళ్ళుగా-ఒకవిధమైన మైకంలో— జీవితం కళ్లెంలేని గుర్రంలా పరుగులు తీస్తూంటే ఉదాసీనంగా ఊరుకునిచూస్తున్న శ్రీనివాసరావ్‌కి- ఇవాళ విషమ గడియలు ఎదురయ్యాయ్. ఏ జీవితానికైనా-ఎప్పుడో ఒకప్పుడయినా - యీ విషమ గడియల పోరుతప్పదు. ఎంత అదృష్టవంతమైన జీవితాన్నయినా కనీసం ఒక్కసారి పరీక్షా క్షణాలు పలుకరించి తీరుతాయ్. ఈసూత్రం నుంచి లక్కీ శ్రీనివాసరావ్‌కూడా తప్పిం చుకోలేక విషమ గడియలలో చిక్కు కున్నాడు. అశనిపాతంలా ఎదురయ్యాయి పరీక్షా క్షణాలు.

అనుకోని అవాంతరమంటే అప్పు పుట్టకపోవడం

అప్పుపుడితే అతనికీ పేకముక్కలకీ వియోగం కల్పించడం.

విధాతకైనా వశంకాదు.

శ్రీనివాసరావ్‌కి అడిగినప్పుడల్లా అప్పిచ్చే అతి మంచి స్నేహితుడొక్కడే ఉన్నాడు. అతనే శ్రీనివాసరావ్‌కి ఆత్మీయుడూ, ఆప్తుడూ అవసర సమయాలలో అప్పుపెడుతూ, ఆపద్బాంధవుడిమల్లె ఆదుకునే ఆ ప్తమిత్రుడు హటాత్తుగా ఎక్కడికో వెళ్ళిపోయాడన్న దారుణవార్త విని- కలలలోనే జీవించే మనిషి వాస్తవాన్నెదుర్కొవలసి వచ్చినట్లుగా - నీటినుంచి బయటకు విసిరివేయబడిన చేపపిల్లలా గిలగిల లాడిపోయాడు శ్రీనివాసరావ్.

ఎన్ని సంవత్సరాలుగా నిత్యమూ క్లబ్బుకి వెళ్తున్నా - బ్యాంక్ కొనుక్కోకుండా కార్డ్సు టేబుల్ నందుకోడం అసాధ్యమని అతనికతి స్పష్టంగా తెలుసు. రూల్సు నతిక్రమించి అవమానంపొందడం అతని కెంతమాత్రమూ అంగీకారంకాదు. ప్రయోజన రహితంగా పరాభవాన్నిభరించ గలిగే ధైర్యం అతనిలో లేదు.

అయినవాళ్ళనీ కానివాళ్ళనీ కూడా అప్పు అడిగి చూసి-చిత్తుగా ఓడిపోయి- ఏమీ చేయలేక - చివరకు యింటికి వచ్చేవాడు శ్రీనివాసరావ్,

ఇల్లు- పేకాట హాలుకాదు, దీనికి కొంత దయా దాక్షిణ్యాలున్నాయి. క్లబ్బులాగా హృదయం లేనిదికాదు. ప్రవేశానికిరుసుము చెల్లించనవసరంలేదు. ఇంటి యజమాని శ్రీనివాసరావ్‌ని అద్దెకూడా అడగడు. అందుకే అది శ్రీనివాసరావ్ పాలిటి చలివేంద్రం వంటిది. ఉచితంగా ఉండనిచ్చే ముసాఫిర్ కానావంటిది.

ఇల్లు— శ్రీనివాసరావ్‌కి అన్నపూర్ణా నిలయంవంటిది కూడా. ఈ యింట్లో సాక్షాత్తూ అన్నపూర్ణ ఉంది. అతన్నిచూసి అడగకుండానే అదనూ ఆకలీ యెరిగి ఒక కబళంపెట్టే అన్నపూర్ణ ఉందక్కడ. ఏవేళ వచ్చినా యింత తిండి దక్కించుకో గలడక్కడ శ్రీనివాసరావ్. ఆ అన్నపూర్ణ పేరు గాయత్రి. ఆమె ఉన్నంతలో మంచి తిండి పెట్టాలనే ప్రయత్నిస్తుంది హృదయ పూర్వకంగా. కాన రుచికరమైన భోజనం ఎప్పుడోకాని అతనికి దొరకదు. అందు కతను విచారించడమూ జరుగదు.

వ్యసనంలో తల మునకలయ్యే శ్రీని వాసరావ్‌కి నిజజీవితంలోని చేదూ తీపీ యెలా తెలియవో, చిరకాలంగా సిగరెట్ల వెగటుతనానికి మాత్రమే అలవాటు పడి పోయిన అతనినోటికీ అలాగే రుచీపచీ తెలియవు.

రాత్రంతా క్రకుర్చీలో కూర్చుని— ఆరడుగుల నేలచాలదూ విశ్రాంతి తీసుకుందుకూ, మేను వాల్చేందుకూ?

ఆ యింట్లో అదీ ఉచితంగానే లభిస్తుంది శ్రీనివాసరావ్‌కి.

హంసతూలికా తల్పాలతను కోరనూ

కోరడు. లభించనూ లభించవు. వెల్లలూడు చున్న గచ్చుమీద చిరుగుల చాపవేసుకుని పడుకుంటాడు. అయినా నిద్రపట్టేస్తుంది నిరాటంకంగా

ఆకలి రుచి తెలియదు, నిద్ర సుఖ మెరుగదు-అన్న లోకోక్తులకు చక్కని నిరూపకం శ్రీనివాసరావ్.

మగవాడిని అప్పుడప్పుడు వేధించే మరో సమస్య పురుషత్వం, శ్రీనివాస రావ్ పురుషత్వం హటాత్తుగా పడగెత్తితే ఉలుకూపలుకూ లేకుండా అతనికి లొంగి పోయేందుకాయింట్లో గాయత్రి ఎప్పుడూ సంసిద్ధంగానే ఉంటుంది.

శ్రీనివాసరావ్-అందుకే లక్కీ-ఫెలో.

అతని అదృష్టానికంతటికీ ఆధారం గాయత్రి.

నూటికినూరుపాళ్లూ హిందూ గృహిణి ఆమె. సాంప్రదాయ నిర్వచనానికి అచ్చు గుద్దినట్లు సరిపోయే సాధ్వి.

కార్యేషుదాసి. శ్రీనివాసరావ్‌కి స్నానానికి నీళ్ళందించడం దగ్గరనుంచీ సిగరెట్ నుసి దులిపేవరకూ ఏం చేయడానికైనా వెనుకాడదామె. క్షమయా ధరిత్రి. నిజం చెప్పాలంటే శ్రీనివాసరావ్ వంటి మనిషిని శ్రీనివాసరావే క్షమించడేమో! కాని — గాయత్రి అతన్నెప్పుడూ క్షమిస్తూనే ఉంటుంది. ఆమె క్షమ అనంతమూ అకళంకమూ. శయనేషు రంభ. శ్రీనివాస రావ్ కనీసం కలలో కూడా రంభను చూడలేదు. మరీ బలవంతపెట్టి రంభ ఎలా ఉంటుందో చెప్పితీరాలంటే ఎర్రగా ఆరీన్ రాణీలా ఉంటుంది కాబోలనేస్తాడు ఆతనికి చాలా విషయాలూ, ఆడవాళ్ళ అంద చందాలూ ఏమీ తెలియవు. మగవాడి నరాలు వేడిగా ఉన్నప్పుడు ఆడ దాని అందం చూడలేడు. ఆమె శరీరం మాత్రమే కనపడుతుంది. స్త్రీ సౌందర్యం ఆకళింపు చేసుకోవాలంటే మగవాడి శరీరమూ మనస్సూ ఉద్వేగోద్రేకాలకు వశమై ఉండే క్షణాలలో అసాధ్యం. తనువూ మనసూ శాంతంగా ఉండి - తీరికగా చూస్తేనే ఆడదాని అందమూ, ఆమె అంత

---

## కొలా (లే)బరేషన్

బయోగ్రాఫరూ-డైరీయిస్టూ అయిన హెరాల్డ్ నికల్సన్‌ని ఒక మహాను భావుడు ఇలాఅడిగేడు: "మీరూ, మీ భార్యా(నవలా రచయిత్రి Sack-Wille-West) కలిసి ఎప్పుడేనా కొలాబరేట్ చేసేరా?"

"వాయస్. మేమిద్దరు పిల్లల్నికన్నాం!" అని జవాబిచ్చేడు సర్ హెరాల్డ్.

ర్యమూ మగవాడికి అవగతం కాగలవు. దౌర్భాగ్యమేమిటంటే—నరాలలో సలపరింపు ఉదయిస్తేనేకాని మగవాడు ఆడదాని గురించి పట్టించుకోడు. తీరా ఆ సలపరింపు పనిచేయడం మొదలుపెట్టాక-ఆ క్షణాలలో ఆడదైనా గాడిదైనా ఒకటే అనేంత గ్రుడ్డితనమూ, చీకటి కోరికా అతన్ని ఆవహించుకుంటాయ్ కోరిక తీరాక ఆడదెలాగూ చింకి చాపలాగే కనిపిస్తుంది. ఈ బాధలన్నీ పడి ఆడదాన్ని అర్థం చేసుకోవడం దేనికిలే అని—స్త్రీ హృదయం అగాధమనీ, స్త్రీ అంటే చంచల అనీ, ఆడదంటే కడివెడు కన్నీళ్లూ, కాస్త జుత్తూ, ఓ యెముకా - యిలా అధ్వాన్నంగా వదిలేశారు ఆడదాన్ని మగ మహారాజులు, ఈ మాత్రమూ పట్టించుకొనే అవసరమూ ఓపికా లేవు శ్రీనివాసరావ్‌కి. కోరికయినా, స్త్రీ అయినా లభించనప్పుడే విలువలు తెలిసేది. స్త్రీ విషయంలో అటువంటి దుస్థితిని కలుగజేయకుండా శ్రీనివాసరావ్‌ని కాపాడింది గాయత్రి. అతనికి తెలిపినంత మేరకు -ఆడదంటే గాయత్రి. అప్సరసంటే అరకురాణి,

శ్రీనివాసరావ్‌కి యింట్లో సలహాల ప్రసక్తి కలగదు. క్లబ్బులో అయితే ఆల్‌కౌంట్ ఆడడమూ, డ్రాప్ చేయడమూ అని టు డు ఆర్ నాట్ టు డు అనే మీమాంసంలో పడటమూ, పక్కవాడి సలహా అడగడమూ జరుగుతూంటుంది కానీ యింట్లో అతని కటువంటి పరిస్థితి ఏనాడూ కలగలేదు. కనుక - గాయత్రి కరణేషు మంత్రి కాలేకపోయింది. సత్ప్రవృత్తి అయిన గాయత్రి - మహాదాత్తురాలో, మహా మంచి అమాయకురాలో కాని - యిన్నేళ్ళ దాంపత్య జీవితంలో ఒక్కసారీ భర్తని యిది కావాలనీ అడగలేదు, అది వద్దనీ అనలేదు. అతని ముందు నోరు విప్పిన సంఘటనలు దాదాపు లేవనే చెప్పాలి. అతని శక్తి తెలుసుకుని - తనకేమీ అడిగే అర్హత లేదనుకుందో, లేక తను కోరినా ఫలితం శూన్యమే ఔతుందనో ఆమె అతని ముందు మౌనానికే అలవాటుపడి పోయింది - రాతి దేముడిముందు మహా భక్తురాలిలా

అనంతమూ, అతి క్లిష్టమూ, కల్లోలమయమూ అయిన సంసార సాగరాన్ని తరించడానికి తరుణోపాయంగా ఆమెకు దొరికిన నౌక ఒక్కటే. అది-శ్రీనివాసరావ్ జేబు, చాలాసార్లు ఆ నౌకా, ఆ జేబూ చిల్లు పడుతూనే ఉంటాయ్.

మానవ జీవితపు మనుగడకి మూలాధారం ఆశాతంతువు. ఈ తంతువు తెగిపోయేది మృత్యువులోనే. అంతవరకూ సాగుతూనే ఉంటుంది ఆశాతంతువు. స్త్రీ జీవితమూ భవిష్యత్తూ, ఆశలూ, సర్వస్వమూ - సాంప్రదాయ ప్రకారం ముడిపడవలసింది భర్తతో.

దురదృష్టవశాత్తూగాయత్రి విషయంలో అలా జరుగలేదు. ప్రాణమున్న శ్రీనివాసరావ్ కంటె - ప్రాణంలేని ఆ జేబులే



నాణ్యతగల వస్త్రాలు?

హార్వే

# ట్విన్ టస్కర్

డ్రిల్‌లు • పాప్లిన్‌లు • గాబర్డీన్‌లు మొదలైనవి




Bensons-1335 A TEL



మధుర మిల్స్ కంపెనీ లిమిటెడ్, మధురై

మెదడూ

ప్రపంచం దేన్నయితే వ్యసనమని జూదమనీ పరిగణించిందో-అదే అతనికి తోచిన జీవనోపాధి

శ్రీనివాసరావ్‌కి జ్ఞానం తక్కువ వ్యసనమనేది పాకుడురాయనీ, ఊబి నిండిన గొయ్యి అనీ తెలియదతనికి

జీవితానికీ జూదానికీ తేడా కూడా తెలియదతనికి.

కాకపోతే జీవితంతో జూదమెందుకాడతాడు? సుఖశాంతులను పణంగా ఎందుకు పెడతాడు?

ఈ క్షణాలలో....శ్రీనివాసరావ్ అమాంతం సగటుమనిషి ఐపోయాడు అతని ప్రమేయం అట్టే లేకుండానే.

సగటు మనిషి తను ఏడుస్తూ-ఎదుటివాళ్ళ సుఖం వాంఛిస్తాడు.

శ్రీనివాసరావ్ అదే చేస్తున్నాడీ క్షణాలలో

కలలమనిషికి కఠకు నిజం ఎదురైతే, సుఖజీవికి చేదు ఆలోచన ఎదురైతే పరిణామం కన్నీరు

శ్రీనివాసరావ్ అందుకే ఏడుస్తున్నాడు మామూలుగా అయితే మగవాడు కన్నీరు పెట్టకూడదు మగవాడి కన్నీటికి సానుభూతి దొరకదు.

శ్రీనివాసరావ్ కళ్ళముందు సినిమా రీలులా తిరుగుతున్నాయి దృశ్యాలు.

అతని మెదడు హటాత్తుగా మేలుకొంది.

ఆ దొరలబ్బాయి చిరుగు చెడ్డీ అబ్బాయిని విడిలించి కొడుతున్న దృశ్యం

డై పోయాడు శ్రీనివాసరావ్. ఇద్దరు పిల్లలు పుట్టినా అతని జీవన విధానంలో కాని ఆలోచనా విధానంలో కాని కించిత్తయినా మలుపూ మార్పూ ఏర్పడలేదు. నిర్మొహమాటంగా నిజం చెప్పాలంటే ఆ పిల్లలను కన్నది గాయత్రి. అమ్మ అయ్యాక ఆమెలో మార్పు కలిగింది కానీ, తండ్రి అయినా శ్రీనివాసరావ్ ఏమీ మారలేదు. ప్రకృతి కానీ. గాయత్రి కానీ. పిల్లలుకానీ-అతని కటువంటి అవసరం కలిగించలేదు.

గాయత్రి-మనుపు ఒంటరి తనపు బద్ధకంతో యింట్లో బియ్యం వున్నా బద్ధకంగా అనిపిస్తే ఓ పూట వస్తుండటానికి వెనుకాడేదికాదు. పిల్లలకు కొంచం యీడు వచ్చాక ఇంట్లో గింజలు అప్పు తెచ్చి అయినా పొయ్యిరాజేసేది. వాళ్ళ ఆకలీ, అల్లరీ తీర్చడం మూలంగా ఆమెకు కొంత కాలక్షేపం కావడం మినహా ఆమెలోనూ పిల్లలు పెద్ద మార్పేమీ తీసుకు రాలేకపోయారు. ఏమార్పు గుర్తించలేని శ్రీనివాసరావ్ యిదీ గుర్తించలేదు.

మంచి అయినా చెడు అయినా అలవాటనేది మనిషిని మహా వేధిస్తుంది. విధి వక్రించడం కాకపోతే - నిశ్చింతగా పేకాటాడు కుంటూ ఉల్లాసంగా సిగరెట్ కాల్చుకుంటూ, ఉత్సాహంగా కబుర్లు చెప్పుకుంటూ ఆనందంగా క్లబ్బులో గడపవలసిన సమయంలో శ్రీనివాసరావ్ ఒంటరిగా యిరుకయిన గదిలో నీరసంగా నడుము వాల్చుకుని పడుకుండటమేమిటి? పడుకుని పడుకుని విసుగెత్తిందతనికి. పేకాటలో అయితే తేదీలు గడిచినా విసుగురాదు. ఇంట్లో గడపడం అతనికి అతికష్టం.

మెల్లగాలేచి కిటికీ దగ్గరకు చేరాడు.

శ్రీనివాసరావ్‌కి - చాలమంది సామాన్యులమల్లె ఊరికే రోడ్లవెంబడి తిరిగే అలవాటులేదు. అయితే క్లబ్బు లేకపోతే యిల్లు. ఆ రెండింటినీ కలిపే రోడ్లమినహా మిగిలిన దారులేనాడో మరచిపోయాడతను అప్పుపెట్టే ఆప్తమిత్రుడి యిల్లు క్లబ్బు పక్కనే. ఏమీ తోచని శ్రీనివాసరావ్ — కిటికీదగ్గర నిలబడి బయటకు చూడసాగాడు. ఆవతల సాయంత్రపు కాంతి సౌందర్యవంతం గానూ ఆరోగ్యకరంగానూ ఉంది. ఇంట్లో అప్పటికే చీకటి ముసురుకుంటూంది.

కొత్తగా వేసిన రోడ్డుమీద — ఎవరో అబ్బాయి మూడుచక్రాల సైకిలు తొక్కుకుంటూ ఆడుకుంటున్నాడు.

ఎండలో ఆ సైకిలు ఎర్రగా మెరుస్తోంది.

దూరానికే కొత్తగా తళ తళ లాడుతూంది,

ముట్టుకుంటే మాసి పోతుందన్నట్లు మిలమిల లాడుతోంది.

సైకిలుమీది అబ్బాయి ముద్దుగాబొద్దుగా ఉన్నాడు. నిక్కరూ, స్పోర్ట్స్ బనీనూ వేసుకుని సీమదొరల చిన్నబ్బాయిలా

ఉన్నాడు.

ముఖం జున్ను ముక్కలా ఉంది.

మూతి చందమామలా ఉంది.

వొళ్ళు-ఉడికించి వొలిచిన బంగాళా దుంపలా ఉంది.

అబ్బాయి-అచ్చంగా రాజకుమారుడిలా ఉన్నాడు.

రాజకుమారుడు గుర్రపు స్వారీ నేర్చుకుంటూంటే పక్కన పరుగెత్తే రౌతు కుర్రాడిలా, దొరలబ్బాయి సైకిలు తొక్కుతూంటే కొద్ది దూరంలో సమాంతరంగా అనుసరిస్తూ పరుగెడుతున్నాడు మరో కుర్రాడు-రాజకుమారుడి వయసు వాడు.

వాడేమీ బాగులేడు.

ఊచలలాటి కాళ్ళు, పుల్లలాటి చేతులు పీక్కుపోయిన ముఖం, రేగినజుత్తు దొరలబ్బాయిలా వీడికి వంకీలజుత్తు లేదు. బుర్ర మీద చిన్న కాకిపిల్ల గూడుంది.

ఓసారి సైకిలు తొక్కనిమ్మని దొరలబ్బాయిని వేడుకుంటున్నాడు, కాళ్ళా వేళ్ళా పడుతున్నాడు-చిరిగిపోయిన చెడ్డీ వేసుకున్న కుర్రాడు.

కనీసం ఓసారి ఆ సైకిలుని ముట్టుకుని తరించే అవకాశమైనా ప్రసాదించమని పరిపరి విధాల ప్రాధేయ పడుతున్నాడు.

ఎగతాళిగా—పిల్ల పురుగుని విదిలించినట్లు విదిలించేస్తున్నాడు రాజకుమారుడు.

'ఒక్కసారి.... ఒక్కసారి.... పో నీ... నన్ను తొయ్యనీ....' వేడుకుంటూనే ఉన్నాడు ముడ్డి మీద చిరిగిన చెడ్డీ వేసుకున్న చింపిరి జుత్తు కుర్రాడు. వినిపించుకోకుండా తూనీగ మల్లె మూడు చక్రాల సైకిలు మీద రివ్వున దూసుకు పోయాడు. దేవతల ముద్దు బిడ్డ వంటి దొరల కుర్రాడు.

ఏడుపు ముఖం వేసుకుని మిగిలి పోయాడు రెండో కుర్రాడు.

ఏడుస్తూంటే వాడసలు బాగులేడు.

వొంటినిండా దరిద్రం పూసుకుని-ఏడుస్తున్న ఆ కుర్రాడు - వికృతంగా నవ్వుతున్న దెయ్యపు పిల్లాడిలా ఉన్నాడు.

శ్రీనివాసరావ్ చూడలేక కళ్ళు మూసుకున్నాడు.

ఇక ఆ కిటికీ దగ్గర నిలబడలేక గదిలోంచి బయటకు వచ్చాడు—వరండాలోకి. అది చిన్నవరండా అదే వంటిల్లు. శ్రీనివాసరావ్ గదిలో పడుకుంటే గాయత్రీ పిల్లలూ ఆ వరండానే నివాసంగా చేసుకుంటారు.

వరండాలో అడుగు పెట్టబోయి కూడా ద్వారాన్ని పట్టుకుని ఆగిపోయాడు శ్రీనివాసరావ్.

"నేను తాగను—" విసురుగా ఉంది పసివాడి కంఠం.

"నా బుజ్జివికదూ, తాగునాన్నా .. రేపు బిళ్ళలు కొనిపెడతాను" బ్రతిమాలుతోంది గాయత్రి.

"నాకక్కర లేదు పో" మూ రాము సాగిస్తున్నాడు బుజ్జి

అమ్మ అమృతమూర్తి. ఐశ్వర్య వంతుల పాపకైనా, పేదవాళ్ళ బిడ్డకయినా అమ్మ దగ్గర దొరికే ప్రేమలో అంత రాలుండవు. తల్లి ప్రేమలో ఎక్కువ లుండవు. ధనవంతురాలు తన బిడ్డ కందించే పాయసంలో ఎంత అప్యాయతా అభిమానమూ నింపి యిస్తుందో, పేద రాలు తన సంతానాని కందించే గంజి నీళ్ళ లోనూ అంత అనురాగమూ వాత్సల్యమూ రంగరించి అందిస్తుంది. ఎటొచ్చీ అది పాయసం, ఇది గంజి.

"నువ్వు పాలువెయ్య లేదు...నీళ్ళే."

"వేశానురా. తాగి చూసుకో."

"అబద్దాలు-" అల్లరి మానడం లేదు వాడు.

గాయత్రి అటువేపు తిరిగి ఉంది.

ఆమె తనను గమనించలేదని తెలిపి - అడుగు ముందుకు వేసి గ్లాసులోకి తొంగి చూశాడు శ్రీనివాసరావ్.

కనిపించిన దేమీ బాగులేదతని కళ్ళకి.

నిజంగానే అవి పాలుకావు. కనీసం పాల నీళ్ళయినా కావు. నీళ్ళ పాలసలే కావు. ఐశ్వర్య వంతుల అబ్బాయి పాలు తాగాక—ఆ వెండిగ్లాసు కడిగి పోసే నీళ్ళు కూడా వీటికంటె నయంగా ఉంటా యేమో.

"నేను చూశానులే...నువ్వు పాలు వెయ్యలేదు. గంజి చుక్కలు వేశావు—" మెల్లగా అన్నాడు శ్రీనివాసరావ్ "మరిచి పోయి ఉంటావు."

వెనుదిదిగి చూసింది గాయత్రి.

శ్రీనివాసరావ్‌ని చూసి ఆశ్చర్య పడింది. ఇన్నేళ్ళ దాంపత్య జీవితంలో అతను యిటువంటి విషయాలలో కలుగ జేసుకోడం యిదే ప్రథమం.

కొన్ని క్షణాలవరకూ ఆమె ఏమీ అన లేక పోయింది.

"ఆ మూల చిన్న గ్లాసులో తెల్లగా అవేమిటి? పాలు కదూ?"

"పాలే... కాని . మీకు .. టీ కలప డానికి...." గొణిగింది గాయత్రి.

"నాకు టీ వొద్దు కానీ వాడికి పాలి చ్చేయి."

గాయత్రి-నమ్మకం చాలనట్లు-నిశ్చ లంగా ఉండిపోయింది

"నిజంగా నా కిప్పుడు టీ అవసరం లేదు, పాలు వీడికిచ్చేయి."

అతని ఆజ్ఞను శిరసావహిస్తున్నట్లు పాలచుక్కలు రెండూ బుజ్జిగాడి నీళ్ళలో కలిపింది గాయత్రి

ఇంకా గ్లాసు తీసుకో లేదు వాడు.

ఎందుకో సందేహిస్తున్నాడు వాడు.

వాడి జీవితంలో ఈ మాత్రపు తెల్లని నీళ్ళను వాడు చూసి ఉండలేదు. పాలవలె ఉన్న నీళ్ళలా, తండ్రి అభిమానమూ వాడికి కొత్తగా అనిపించి—ఆ విశ్వాసంలోనూ, అనుమా నంలోనూ కొట్టుమిట్టాడుతున్నట్లు వాడి అమాయక నేత్రాలు మౌనంగా భాష్యం చెప్తున్నయ్

"తాగెయ్. నీకు బిళ్ళలు కొంటాను."
అని—అక్కడ నిలువలేక గదిలోకి వచ్చే శాడు శ్రీనివాసరావ్.

ఎప్పుడొచ్చాడో యేమో - ఆ గదిలో నేలమీద పడుకుని-నిశ్శబ్దంగా కుళ్ళి కుళ్ళి ఏడుస్తున్నాడు-చిరుగులచెడ్డీ కుర్రాడు.

ఎందుకని అడగడానికి ధైర్యం చాల లేదు శ్రీనివాసరావ్‌కి.

అసమర్ధుడిలా కళ్లు మూసుకుని కూర్చుండిపోయాడు - వాస్తవాన్ని, చూడ డమూ, జీర్ణం చేసుకుని భరించడమూ తన తరం కానట్లు.

మనిషి మెదడు ఒక విధంగా కత్తి వంటిది.

వాడుకలేక తుప్పుపట్టినా - సహజ లక్ష ణాన్ని పూర్తిగా పోగొట్టుకోదు

మనిషి-జంతువుకంటె అధికుడు

తిన్నతిండిని మాత్రమే నెమరువేసుకో గలదు పశువు.

జరిగిన సంఘటనలనూ, భూతకాలాన్నీ ఆలోచనలముందు ప్రతిష్టించుకో గలిగే శక్తి మానవ మస్తిష్కానికుంది ఇది వరమూ, శాపమూ గూడా. జీవితం లాగే యిది కూడా మనిషి ననుసరించి అతని పాలిట వరమో శాపమో అవుతూ ఉం టుంది.

అయిష్టమైన దృశ్యాన్ని చూడకుండా కళ్ళు మూసుకోగలడు మనిషి. కారణం- భగవంతుడు మనిషికి కన్నులతోపాటు వాటికి రెప్పలూ యిచ్చాడు కనుక. మన సుకే ఆలోచనలకీ మూతల నివ్వలేదు నిర్దయుడైన దేముడు. శ్రీనివాసరావ్ కూడా ఓ మనిషి. ఆ మనిషిలోనూ స్పం దించే హృదయముంది, ఇన్నాళ్లుగా నివురు కప్పిన నిప్పులా ఉండిపోయిన అతని హృదయం-యీ క్షణాలలో ఉన్నట్లుండి బయటపడి అతన్ని దహింప సాగింది. అతని బాధ-కన్నీళ్ళుగా ప్రవహిస్తోంది.

ప్రపంచంలోని కోటానుకోట్ల మనుషు లలో ఏ వొక్కడూ సగటుమనిషి కాడు. కాని-విచిత్ర మేమిటంటే ప్రతి వొక్కడూ జీవితంలో ఎప్పుడో ఒకప్పుడు-క్షణికంగా అయినా సగటుమనిషి కాకుండా ఉండ లేడు ఈ క్షణాలలో శ్రీనివాసరావ్ సగటు మనిషి కాసాగాడు.

అతను ఆలోచించలేదు - జ్ఞాపకాలు తెచ్చుకోగలగడం మాత్రం యింకా మరిచి పోలేదు వయసు-వృద్ధాప్యం వెన్నుతట్టి పలకరించవలసినంతగా పెరగలేదు ఇంకా కౌమారపు హద్దులలోనే చరిస్తూంది శ్రీనివాసరావ్ వయసు. అందు చేతనే బాల్యస్మృతులు మెదడు పొరలమీద గాఢంగానే ప్రతి బింబిస్తూన్నయ్.

ఇందాక చూపిన సీమదొరల చిన్న బ్బాయికంటె కూడా శ్రీమంతంగానే పెరి గాడు శ్రీనివాసరావ్. అప్పు డతను శ్రీను బాబు, చినబాబు. అమ్మవడి-నాన్న తొడ- తప్పితే నౌకర్ల భుజాలు ...వాటి మీదే తప్ప నేలమీద పెరగలేదు చిన బాబు. అతని పాలకోసమని ప్రత్యేకంగా రెం

డావులను పోషించేవాడు మానాపురం జమీందారు. చిన బాబు ఆడుకుందుకు విదేశీ ఆటబొమ్మలు. అవన్నీ రెండు గదుల నిండుగా ఉండేవి. షికారు వెళ్ళేందుకు-ప్రత్యేకంగా జపాన్‌నుంచి ఎర్ర బేబీ కారు. కాలితో తొక్కి శ్రమపడే అవసరమే ఉండేది కాదు

కొంతవయసు వచ్చేవరకూ అంత శ్రీమంతంగా పెరిగాడు శ్రీనివాసరావ్.

ఐశ్వర్యం-హారతి కర్పూరం వంటిది హరించుకు పోయేవరకూ సువాసనలు కురిపిస్తూ ఉక్కిరి బిక్కిరి చేస్తుంది. అంతా అయిపోయాక మిగిలేది - మచ్చ. బళ్ళు ఓడలు కావడం కష్టమేమో కాని - ఓడలు బళ్లుకావడం అతిసులభం. విధి ఆడే ఆటలు అప్పుడప్పుడు అతిక్రూరంగా ఉంటాయ్-పసివాళ్ళు తూనీగల రెక్కలుకట్టి హింసించి వినోదించేటట్లు

లేమికీ కలిమికీ మధ్య అంతరం అగాధం, కలిమికీ లేమికీ నడుమ సరిహద్దు సన్నని గీత మాత్రమే.

ఛట్టమొచ్చి సిరికొట్టుకు పోయింది.

అప్పులు ఆస్తిని తెగమింగాయి.

కట్టు బట్టలతో మిగిలాడు శ్రీనివాసరావ్. అతనితోపాటు అర్ధాంగి. చెడి బ్రతకడం సులభం కానీ బ్రతికి చెడటం బహుదుర్భరం. ఆనాటి ఐశ్వర్యం ఏమీ మిగలకపోయినా అహంభావమూ అభిజాత్యమూ అతన్ని వదలలేదు—యింగువ తీసివేసినా ఆ గుడ్డ వాసనలు వదలనట్లు.

ఎవరో జాలిపడి బ్రతుకుతెరవు చూపబోయారు.

స్వీకరించేందుకు అహంభావం అడ్డుపడింది. తన మోచేతి నీళ్ళు తాగి బ్రతికిన మనిషి దయ చూపితే స్వీకరించడం ఎంత కష్టం!

బ్రతుకుపోయినా పరువు పోకూడదని విశ్వసించే ఐశ్వర్యవంతుడు - పూలమ్మిన చోట-కట్టెలమ్మలేక-తన ముఖం తెలియని పరాయి ప్రదేశానికి చేరుకున్నాడు,

కొత్త మనుషులు

కొత్త చోటు-నిలువ నీడలేదు

బ్రతుక్కి మదుపూ మార్గమూ ఏమిటి?

కష్టమంటే యెరుగని శ్రీనివాసరావ్‌కి కష్టపడి సంపాదించడంలో నమ్మకం కలగలేదు ఐశ్వర్యం అంచెలంచెలుగా వచ్చేది కాదనీ, కష్టపడే వాడికి మిగిలేది కష్టమే అనీ అతని ప్రగాఢ విశ్వాసం. దయామయుడు చూపిన బ్రతుకు తెరవును తిరస్కరించడానికిది కూడా కారణమే అని శ్రీనివాసరావ్ అంతరాత్మకి తెలిసిన వెగటు నిజం సుకుమారంగాపుట్టి అలాగే పెరిగా డతను

శ్రీనివాసరావ్ జీవితం ప్రారంభించాడు.

మదుపు-మాంగల్యమైంది. గాయత్రి మెడలో పసుపుకొమ్ము వెలసింది.

మార్గం-కల్లుబ్బు.

వృత్తి-పేకాట.

పరికరాలు - పేకముక్కలూ, కొంచం

మెదడూ.

ప్రపంచం దేన్నయితే వ్యసనమని జూదమనీ పరిగణించిందో-అదే అతనికి తోచిన జీవనోపాధి.

శ్రీనివాసరావ్‌కి జ్ఞానం తక్కువ. వ్యసనమనేది పాకుడురాయనీ, ఊబి నిండిన గొయ్యి అనీ తెలియదతనికి.

జీవితానికీ జూదానికీ తేడా కూడా తెలియదతనికి.

కాకపోతే జీవితంతో జూదమెందుకాడతాడు? సుఖశాంతులను పణంగా ఎందుకు పెడతాడు?

ఈ క్షణాలలో....శ్రీనివాసరావ్ అసాంతం సగటుమనిషి అయిపోయాడు అతని ప్రమేయం ఆట్టే లేకుండానే.

సగటు మనిషి తను ఏడుస్తూ-ఎదుటివాళ్ళ సుఖం వాంఛిస్తాడు.

శ్రీనివాసరావ్ అదే చేస్తున్నాడీ క్షణాలలో.

కలిలమనిషికి కరకు నిజం ఎదురైతే; సుఖజీవికి చేదు ఆలోచన ఎదురైతే.... పరిణామం కన్నీరు.

శ్రీనివాసరావ్ అందుకే ఏడుస్తున్నాడు. మామూలుగా అయితే మగవాడు కన్నీరు పెట్టకూడదు మగవాడి కన్నీటికి సానుభూతి దొరకదు.

శ్రీనివాసరావ్ కళ్ళముందు సినిమా రీలులా తిరుగుతున్నాయి దృశ్యాలు.

అతని మెదడు హఠాత్తుగా మేలుకొంది.

ఆ దొరలబ్బాయి చిరుగు చెడ్డీ అబ్బాయిని విదిలించి కొడుతున్న దృశ్యం

అతని మనోనేత్రంముందు చెరగకుండా నిలచిపోతూంది.

బుజ్జిగాడికి పాలు వేయకుండా గంజి చుక్కలు రాల్చి నీళ్ళరంగు మార్చి— పాలగా భ్రమింపజేసి తాగించడానికి ప్రయత్నించడం ఆ గ్లాసు .... అవన్నీ అతని కళ్ళముందు చెరగని. చెదరని చిత్రాలయ్యాయి.

తను ఎలా పెరిగాడో మరచిపోలేక పోతున్నాడు.

తని తండ్రి తననెలా పెంచాడో, తను తన బిడ్డలనెలా పెంచుతున్నాడో—

రెండింటినీ పోల్చి చూడకుండా ఉండలేకపోతున్నాడు శ్రీనివాసరావ్

ఇవన్నీ చూస్తూ నీళ్ళు కార్చకుండా ఉండలేకపోతున్నాయతని కళ్ళు.

ఇంతవరకూ శూన్యంగా ఉన్న హృదయంలో పశ్చాత్తాపం పొంగి పొరలుతూంది. క్షణక్షణానికి అది దావానలంలా వ్యాపిస్తూ హృదయాంతరాలని దహిస్తోంది. ఆవేదన భరించలేక ఏడుస్తున్నాడు శ్రీనివాసరావ్

పశ్చాత్తాపం పరిపరి విధాల శిక్షిస్తోందతన్ని.

సుకుమారుడు - ఒక్కసారిగా అంత శిక్ష భరించడం చాతకాక తల్లడిల్లిపోతున్నాడు.

అవ్యక్తమైన ఆరాటంతో కొట్టుమిట్టాడుతున్నాడు శ్రీనివాసరావ్.

చేసినదానికి నిష్కృతి కోరుకుంటున్నాడు.

గడచిపోయిన గతం తిరిగిరావాలని పేరాశకు పోతున్నాడు పిచ్చిగా, దారితప్పిన బాటసారిలా వ్యధచెందుతున్నాడు.

"బిళ్ళలు కొంటావా?" బితుకు బితుకుమంటూనే అడిగాడు బుజ్జి తండ్రికి బారెడు దూరంలో నిలబడి.

శ్రీనివాసరావ్‌కి తెలుసు. తనకీ వాడికీ యింతకాలమూ అంతదూరమని. తను— తండ్రి తొడమీద కూర్చుని ముద్దులు కుడవడం కళ్ళముందు మెదిలింది

"బుజ్జి—" అంటూ వాడిని వడిలోకి లాక్కున్నాడు.

శ్రీనివాసరావ్ కన్నీరాగలేదు.

కన్నీటి పొరలలోంచి చిరిగిన చెడ్డీ సీమదొరల చిన్నబ్బాయి ఎర్ర సైకిలూ, తను చిన్నప్పుడు తిరిగిన ఎర్రకారూ కనిపిస్తూనే ఉన్నాయి. హటాత్తుగా వాడిని లేపి రెండవ తొడమీద కూర్చోబెట్టుకున్నాడు.

"కొత్త సైకిలు " నిద్రలో మల్లె కలవరిస్తున్నాడు వాడు.

"బిళ్ళలు . " గునుస్తున్నాడు బుజ్జి.

భోరున ఏడ్చేశాడు శ్రీనివాసరావ్— కన్నీటితోనే పాప ప్రక్షాళన చేసుకోదలచినట్లు.

ఏం జరిగిందో అని కంగారుగా పరుగెత్తి వచ్చిందక్కడకి గాయత్రి.

ఆ దృశ్యం ఆమెకు ఏమీ అర్ధం కాలేదు.

మేలుకునే కల కంటున్నట్లు బొమ్మలా నిలబడిపోయింది.

"ఇలారా గాయత్రీ. నా దగ్గరగా రా. మీరంతా నన్ను క్షమించాలి, నేను పాపాత్ముణ్ని....మీ అందరికీ ఎంతో ద్రోహం చేసాను. ఒక్కసారి మీరు నన్ను క్షమించక పోతే నేను బతకలేను గాయత్రీ,"

కలవరిస్తున్నట్లు అంటున్నాడు శ్రీనివాసరావ్.

గాయత్రికంతా అయోమయంగా ఉంది, మెల్లగా శ్రీనివాసరావ్‌ని చేరుకుంది తడబడుతున్న అడుగులతో. ముగ్గురినీ దరి జేర్చుకుని దుఃఖించసాగాడు శ్రీనివాసరావ్.

* * *

ఎక్కవలసిన రైలు జీవితకాలం ఆలస్యమైతే ఫలితం నిరీక్షణ. నిరీక్షణలో ఆశ ఉంటుంది కనుక హాయి ఉంటుంది

ఎక్కవలసిన రైలు — జీవితకాలం ముందయితే చాలా బాధాకరం, వెళ్ళిపోయిన రైలు - పశ్చాత్తాపానికి హేతువౌతుంది, పశ్చాత్తాపంలో దుఃఖమే కాని సుఖం శూన్యం.

శ్రీనివాసరావ్ దుఃఖానికీ పశ్చాత్తాపమే కారణం. ఇది అతని శేష జీవితమంతా మిగిలే ఉంటుంది. తానెక్కవలసిన రైలు జీవితకాలం ముందుగా వెళ్ళిపోయిందని అతనికి ఆలస్యంగా తెలిసివచ్చింది.

మనిషి-నిరీక్షణలో సుఖం వెదుక్కోగలడు కానీ పశ్చాత్తాపంలోని దుఃఖం నుంచి తప్పించుకోలేడు,

కనుక-జీవితారంభంలోనేఎక్కవలసిన రైలేదో సరిగ్గా చూసుకుని మరీ ఎక్కడం మంచిది.

లేకపోతే ఫలితం-మరో శ్రీనివాసరావ్

తస్మాత్ జాగ్రత్త *

---

## తెరవెనక భాగోతం

'గో నేకెడ్ ఇన్ ది వరల్డ్'(ప్రపంచములో నగ్నంగా పో!) అనే సినిమాలో జినాలోలా బ్రిగిడా ధరించడానికి డిజైనర్ హెలిన్‌రోజ్ 25 కల్పనాత్మకమైన కాస్ట్యూమ్స్ సృష్టించింది.

"ఇద్దరి ఆత్మీయ గాథ' గా వర్ణించబడే 'ది రేట్ రేస్' కథని తెరమీద కెక్కించడానికి 1093 మంది అవసరమయ్యేరు

'ది అలామో' సినిమాతీసినప్పుడు-అసలుముట్టడిలో ఇరుపక్షాలవాళ్లు తినే దానికన్నా ఎక్కువ తినబడివదార్థాలు వడ్డించవల్సివచ్చింది. నటీనట వర్గం-సాంకేతిక సిబ్బంది 3 49 000 గుడ్లు తిన్నారు 5,10 000 కాఫీకప్పులెగ రేసినారు

'ది మ్యూజిక్ మేన్' సినిమాలో "సెవన్‌టీసిక్స్ ట్రాంబోన్స్" అనేపాటకి అసలు ఉపయోగించినవి 200 ఇత్తడి వాయిద్యాలు

# ఊహల శిఖరాలు

## 14

"ఇప్పడుకో రవీ! పొద్దుపోయింది" అన్నారు సుభద్రమ్మగారు లేస్తూ.

సత్య సుదర్శనంగారి గదిలోకి వెళ్ళింది.

సుభద్రమ్మగారు వరండా పక్కగా వున్న గదికి లోపల వైపునుంచి తలుపులు తెలుస్తూ. 'రెండు సంవత్సరాల తరువాత మళ్ళి యీ గది లోపలికి మనిషి అడుగు పెట్టడం అవుతోంది,' అన్నారు. ఆ అనడంలో ఆవిడ కంఠం కొద్దిగా కంపించటం నేను గమనించకపోలేదు. నేను గది లోపలకు వచ్చాను.

గది ఎంతో శుభ్రంగా రోజు వాడుతున్నట్లే వుంది.

పక్క మీద తెల్లటి దుప్పటి పరచి వుంది టేబిల్ మీద పుస్తకాలు నీట్‌గా సర్దివున్నాయి.

"మధ్య రాత్రిలో మంచినీళ్ళు తాగే అలవాటుందా? వుండు. తెచ్చి పెడతాను" అంటూ ఆవిడ వెళ్ళారు.

నేను మంచం మీద కూర్చున్నాను.

ఎదురుగా స్టాండ్ మీద పాంట్లు, షర్టులు యింకోపక్క షెల్పు, స్టాండ్‌కి దిగువున రెండు మూడు రకాల బూట్లు, నాలుగైదు రకాల చెప్పులు వున్నాయి. టేబిల్ మీద మంచానికి కాస్త దగ్గరగా వున్న టేబిల్ లైట్ కూడా మోడరన్ ఆర్టుతో చాలా అధునాతనంగా వుంది. మంచం మీద కూర్చుని కళ్ళతో అవన్నీ పరికిస్తున్న నాకు, యీ గది యజమానికి ఫాషన్‌పట్ల ఎంత మక్కువో అర్థమయింది. నాకు పరాయివాళ్ళ యింట్లో పడుకుంటే చప్పున నిద్ర పట్టదు. దానికి తోడు భుజం మీద గాయం తీపు పుడుతున్నట్లుగా సలుపుగా వుంది. ఈ రాత్రి యిక్కడ జాగారణ ఏలాగూ తప్పదు అనిపించింది.

సుభద్రమ్మగారు వంట యింట్లో సర్దుతున్న చప్పుడవుతోంది. మెల్లగా వెనక్కివాలి పడుకున్నాను. దాదాపు సంవత్సరం నుంచి యిల్లు అనే పదంతో సాంగత్యం తెగిపోయి. గూడు తెగిన పిట్టలా తిరుగుతూ అక్కడక్కడా కాలక్షేపం చేస్తున్న

నాకు యీ యిల్లు, యీ గది ఎంతో హాయి అనిపించింది.

"నిద్ర పట్టిందా?" గుమ్మంలో నుంచి వినిపించింది,

నేను చటుక్కున లేచి కూర్చున్నాను

"ఉహూ!"

సత్య గ్లాసుతో నీళ్ళతో లోపలికి వచ్చింది. చేతిలో ఏదో మాత్ర వుంది.

"యిదిగో యిది వేసుకు పడుకోండి" అంటూ యిచ్చింది.

నేనేదయినా జేయగలను కానీ, యీ మందులు మాత్రం మింగలేను. ఒక్క చిన్న మాత్ర మింగాలంటే నాకు ప్రాణం మీదకి వచ్చినట్టు వుంటుంది. చేతిలో పెట్టుకొని రెండుసార్లు నోటివరకూ తీసు కెళ్ళి మానేసాను.

సత్య ఫకాల్న నవ్వింది.

"భలేవారే యీ చిన్న పిల్లల మనస్తత్వం మీలో కూడా వుందే!"

సత్య నవ్వినందుకు నాకు రోషం వచ్చింది.

వెంటనే నోట్లో వేసుకుని మింగేసాను.

"గుడ్! చక్కగా, హాయిగా నిద్ర పడుతుంది యిక పడుకోండి. మంచినీళ్ళు అందిస్తూ అంది

నీళ్ళు తాగేసి గ్లాసు టేబిల్ మీద పెట్టేసాను.

టేబిల్ అంచుని ఆనుకుని నిలబడ్డ సత్య దృష్టి దూరంగా వున్న బట్టల స్టాండు మీద నిల్చిపోవడం నేను గమనించిక పోలేదు

సత్య కళ్ళల్లో చెప్పలేని విషాదం అలుముకుంది

రెప్ప వేయకుండా ఆలోచనల్లో పడ్డట్టు ఆమె బట్టల వేపు తదేకంగా చూస్తూ నిలబడింది. సత్య మనసులో ప్రసాద్‌ని గురించిన జ్ఞాపకాలు సుళ్ళు తిరుగుతున్నాయని గ్రహించాను!

---

# యద్దనపూడి సులోచనారాణి

---

సత్య నా వునికి మర్చిపోవటం నాకు నచ్చలేదు.

"ఈ గది రెండు సంవత్సరాల నుంచీ వుపయోగించటం లేదని ఆవిడ అన్నారు. కానీ దీన్ని చూస్తూంటే అలా అనిపించటం లేదే నాకు" అన్నాను.

"ఉపయోగించటం అంటే? ఎవ్వరూ వాడుకోని మాట నిజమే! కానీ రోజూ శుభ్రం చేస్తాం. అత్తయ్య తీరుబడి అయినప్పుడల్లా, ఈ గదిలోకి వచ్చి ఏదో ఒకటి

సర్దుతూనె వుంటుంది. నేనూ అంతె!మాకు మాకెందుకో యీ గది చూస్తుంటే బావ పోయినట్టే అనిపించదు. యింకా ఎప్పుడో తిరిగి వచ్చేస్తాడన్నట్టే వుంటుంది."

"ఈ గదిని చూసిన ఎవరయినా అదే అనుకుంటారు" అన్నాను

"సత్యా! మంచినీళ్ళు పెట్టమ్మా గదిలో"

సుభద్రమ్మగారి కేక వినిపించింది

"లేదండీ!" సత్య వప్పున బైటకి వెళ్ళింది.

మంచినీళ్ళు తెచ్చి టేబుల్ మీద పెట్టి వెళ్ళిపోబోతూ క్షణం ఆగింది. ఎదురుగా టేబుల్ మీద సత్య ఫోటో బస్ట్ సైజులో వుంది.

ఒక్క నిముషం దాన్ని తదేకంగా చూసిన సత్య ఫోటోని పక్కకి తిప్పి బోర్లా పడేసింది,

"అన్యాయం!" అన్నాను.

"ఏమిటి అన్యాయం?" నా వైపు తిరిగింది.

"నాకు మంచి కలలు రావడం మీకిష్టం లేదా?"

"నేను మీకు మందిచ్చాను. మీకు అసలు కలలు రావు. మంచి నిద్ర పడు తుంది,

"థాంక్స్" అంటూనే చేయి చాచి ఫోటో తీసి సరిగా పెట్టాను.

"నేను లైటు తీసేసి వెళుతున్నాను. చీకట్లో మీకేవీ కనిపించవు."

"తీసేయండి లైటు, నాకు చీకట్లో చూసే అలవాటుంది,"

సత్య పెదవుల మీద చిరునవ్వు కదిలింది.

'సరి! గుడ్‌నైట్. విష్ యూ హాపీ డ్రీమ్స్" అ మాటలు అలవాటయినట్టే యాంత్రికంగా వచ్చేసినాయి.

"థాంక్ యూ."

సత్య లైటుతీసి తలుపు దగ్గరేసి వెళ్ళి పోయింది.

నా మనసు నేను ఎన్నడూ ఎరగనంత ప్రశాంతతగా హాయిగా వుంది.

నేను మెల్లగా వెనక్కి వాలి పడుకు న్నాను.

అప్పుడప్పుడు యిలాటి శాంతితో సేద దీరగలిగితే మనిషి ఎంతయినా కష్టపడ గలడు అనిపించింది.

సత్య ముఖం కళ్ళ ముందు మెదిలింది

ఆ ముఖంలో స్వచ్ఛత, నిష్కల్మ షత్వం అయస్కాంతాల్లా ఎదుటవారిని యిట్టే ఆకర్షించుకుంటాయి.

సత్య, ప్రసాద్ యిద్దరూ చాలా అన్యో న్యంగా వుండేవాళ్ళు.

ప్రసాద్ మరణం సత్యని మానసి కంగా విరక్తి కలిగేలా చేసింది.

ఏది! ఏమయినా సత్య డాక్టర్! ఆ వృత్తిలో ఎలాటి చిరాకులయినా, ఎంత విషాదాలయినా మరిచిపోవచ్చు.

నా కళ్ళు మెల్ల మెల్లగా మూతలు పడ్డాయి. చాలా మంచి నిద్ర! విశ్రాంతి అనే తూగుటుయ్యాలలో వూగుతూన్నట్టి

అనుభూతి.

వున్నట్టుంకి నా కళ్ళ ముందు ఏదో వెలుగు కనిపించింది ఆ వెలుగు మామూలుగా లేదు, వుజ్వలంగా వుంది. భగ భగ లాడుతూ నాలుక చాచి లేస్తున్న సర్పాల సమూహంలా వుంది. మంటలు! యిలా అంటుకుంటూ దర్వాజకి వున్న పరదా అంటుకుంది

నేను లేవాలని ప్రయత్నిస్తున్నాను

సత్య యిచ్చిన మందు ఎలాటిదో! నేను నిస్సత్తువగా అయిపోయాను మంచం మీద నుంచి లేవలేక పోతున్నాను.

మంటలు దర్వాజ పక్కనున్న బీరువా అంటుకుంది. దాని తలుపులు ఫెళ ఫెళ విరుగుతున్నాయి మంటలు మెల్లగ గది అంతా వ్యాపిస్తున్నాయి నేను కాలి ఆశక్తతవల్ల పిచ్చివాడిని చేస్తోంది. సత్య నాకసలు ఏం మందిచ్చింది! నే నెందుకిలా లేవలేక పోతున్నాను ఈ గలో పడుకోవటం సత్య కిష్టం లేదా? సుభద్రమ్మగారు నన్ను ఆప్యాయంగా చూడటం సత్యకి కంటకంగా వుందా!

చుట్టూ వ్యాపించాయి మంటలు.

పరుపు క్రింద కూడా వేడి తగిలింది. మంచానికి ఎవరో నిద్ర పోతుండగా నన్ను కట్టివేసారు. భగవాన్! దారుణమైన యీ చావు కోసమా యీ యింటికి అడుగు పెట్టాను.

మంటలు చుట్టూ వ్యాపించాయి.

మంచం మీద నుంచి లేవకుండా, అశక్తుడయి పోతున్నా నేను కెవ్వున అరిచాను. కేకలు పెట్టాను. నా పిచ్చిగానీ నా కేకలు ఎవరికి వినిపిస్తాయి? ఈ చుట్టుపక్కల ఎవరయినా వుంటేగా! మంట నా పై జామాకి కూడా అంటుకుంది. కాళ్ళతో విదిలించేస్తూ గట్టిగా అరిచాను. నా చేతులు ఎందుకు కదలటం లేదో నాకే తెలియటం లేదు

"రవీ! రవీ! రవీ!" ఎవరో నా తల పట్టి గట్టిగా కుదిపారు.

నేను మెల్లగ కళ్ళు తెరిచాను.

మంటలు మెల్లగ అదృశ్యమైనాయి.

ఎదురుగా సుభద్రమ్మగారి ముఖం కన్పించింది.

"ఏమిటి రవీ! ఏమైనా కల వచ్చిందా? ఎంత కేకలు పెట్టావో తెలుసా! నాకు పూర్తిగా మెలకువ వచ్చింది.

నా ఒంటినిండా చెమటలు దిగ కారుతున్నాయి.

"ఆఁ ఆఁ!" అన్నాను అస్పష్టంగా. యింత వాస్తవంగా, యింత భయంకరంగా అన్పించిన యీ అనుభవం కలా! నమ్మలేక పోతున్నాను.

ఆవిడ కొంగుతో నా నుదుట చెమటలు అద్దారు.

"కొత్తచోటు కదా నీకు నిద్ర సరిగ్గా పట్టలేదేమో!" అన్నారావిడ.

"నా కెప్పుడూ రాలేదు యిలాటి కల!" అన్నాను కొద్దిగా దేరుకుంటూ.

"ఏం కల అది?" సత్య ప్రశ్నించింది.

నేను అప్పుడే సత్య కూడా అక్కడు న్నట్లు గుర్తించాను.

"ఏం కలా, చాలా భయంకరమైనది. కల యింత వాస్తవంగా అన్పిస్తుందని నాకు తెలియదు."

"ఏమిటి రవీ అది?" ఆవిడ కూడా అడిగారు.

నేను చెప్పాను. నేను చెప్పటం మొదలు పెట్టగానే సత్య ఆవిడ ముఖాలు చూసుకున్నారు'

అని వింటుండగానే ఆవిడ తెల్లబోయి నట్టు చూడసాగారు.

సత్య 'హా' అన్నట్టు గుండెల మీద చేయి వేసుకుంది. నే చెప్పటం పూర్తయే సరికి సుభద్రమ్మగారి చెయ్యి నా మణికట్టు మీద గట్టిగా బిగుసుకుంది.

ఆవిడ కళ్ళు ఆశ్చర్యంలోను, భయం తోనూ పెద్దవయినాయి.

"ఎంత విచిత్రం! సరిగ్గా ప్రసాద్ యింకో ఆర్నెల్లకి పోతాడనగా యీ గదిలో నిజంగా అలాటి ప్రమాదం జరిగింది! నేను ఆయన వూళ్ళోలేం. బంధువుల యింటికి పెళ్ళికి వెళ్ళాం. ప్రసాద్-ఖాన్సామ యిద్దరే యింట్లో వున్నారు. ఓరోజు రాత్రి యిలా అంటుకుంటూ కర్టెన్లువాలి వాడి పుస్తకాలు అంటుకున్నాయి. ప్రసాద్‌ది కాస్త మొద్దు నిద్ర

వాడికి మెలకువ వచ్చేసరికి దాదాపు బట్టలుకూడా అంటుకున్నాయి! ఎలాగో ఎంతకష్టంమీద, ఆ ప్రమాదంలోంచి బైట పడ్డాడు. సరిగ్గా యిదే నీకు కలరావడం ఎంత విచిత్రం!"

ఆవిడ నోటి వెంబడి వెలువడుతున్న యీ మాటలు వినగానే నేను నిశ్చేష్టుడిని అయ్యాను!

యిది యదార్థంగా జరిగిన సంఘటనా! తర్వాత చాలాసేపటి వరకూ ఆవిడ ఆ పాత సంగతులు చెబుతూ నా దగ్గర కూర్చుండిపోయింది.

"యిక పడుకో అంటే! రెండయింది" అంది సత్య హెచ్చరిస్తున్నట్టుగా, ఇద్దరూ వెళ్ళారు.

నేను పడుకున్నాను సుభద్రమ్మగారు చెప్పిన మాటలు పదే పదే విన్పిస్తున్నాయి. వంటరిగావున్న ఆ పాతగది అంటుకోవ డము నాకు కాస్త విచిత్రంగానే అనిపిం చింది ప్రసాద్ సిగరెట్టు కాలుస్తాడని, చెయిన్ స్మోకర్ అని అవిడ చెప్పారు. సగం కాలిన సిగరెట్ నిర్లక్ష్యంగా యిట పడేస్తే అదికంగా అంటుకుని వుండి వుంటుంది అంటున్నారావిడ!

రాత్రి పొద్దుపోయిన తర్వాత-గాయ పడి యిక్కడికి వచ్చి వాళ్ళకి యిబ్బంది కలిగించినందుకే మొహమాట పడుతున్న నేను, అర్ధరాత్రికూడ కేకలతో అదరగొట్టి వేసినందుకు యింకా సిగ్గు పడ్డాను! ఛి-ఛి! నిద్రలో లేపడం, అరవడం నా కెప్పుడూ అలవాటు లేవు. తర్వాత-గంట గంటన్నర వరకూ నాకు నిద్రపట్టలేదు.

ఈసారి, సత్య చెప్పినట్టే ఎలాటి

కంతా లేకుండా గాఢసుషుప్తిలోకి జారి పోయాను.

ఉదయం సుభద్రమ్మగారు వచ్చి తట్టి లేపేవరకూ నాకు నిద్ర మెలకువ రాలేదు.

'రవీ! లేస్తావా? లేచి ముఖం కడుక్కొని కాఫీ తాగి పడుకో." అన్నారావిడ.

మంచంమీద లేచి కూర్చున్నాను.

భుజం రాత్రికంటే బాగా నొప్పి చేసింది!

నాలుగైదు గంటలయినా మంచి నిద్ర పోవడంతో బడలిక తీరనట్టయింది! ముఖం కడుక్కొని కాఫీ తాగుతుండగా సత్య లోపలకి వచ్చింది.

"నేను హాస్పిటల్‌కి వెడుతున్నాను. ఆంటీకి చెప్పాను. ఈ పూట మీరు ఎక్కడికీ కదలొద్దు. పూర్తిగా విశ్రాంతి తీసుకోండి" అంది.

అప్పుడే స్నానంచేసి తెల్లటి బట్టలు ధరించిన సత్య రాత్రి మంచుకి తడిసిన మల్లెపువ్వులా కన్పించింది.

"సేను, రాత్రి మీకు చాలా ఇబ్బంది" మొహమాటంగా నసిగాను.

"ఆ క్షమార్పణలు - సంజాయిషీ లేవో ఆంటీకి చెప్పండి. నాకు టైమయి పోతుంది. సేను వెళ్తున్నాను." అంది నవ్వుతూ.

సుదర్శనంగారు యింకా అప్పటికి లేవలేదు.

ఆయన యీ మధ్య రాత్రిళ్ళు నిద్ర పట్టడంకోసం, రవంత నల్లమందు అలవాటు చేసుకుంటున్నారని చెప్పారావిడ:

నేను లేచి ముఖం కడుక్కొని, కాఫీ తాగుతూ, రాత్రి మిమ్మల్ని ఇంగారు పెట్టినందుకు మన్నించాలి." అన్నాను.

"యిందులో మన్నించటానికి ఏముంది గానీ, ప్రసాద్‌కి జరిగిన ఆ సంఘటన అచ్చు అలాగే నీకు కలరావటం మాత్రం నాకు చాలా విచిత్రంగావుంది. ఆ తర్వాత చాలాసేపటి వరకూ నిద్రే పట్టలేదు" అన్నారు.

నేను కాఫీ తాగి పదినిమిషాల తర్వాత ఆవిడ టాబిలెట్స్ తెచ్చి యిస్తూ, "యిదుగో - సత్య యీ మందు వేసుకోమంది" అంటూ యిచ్చారు.

నేను అవి వేసుకున్న తర్వాత, "యిక వెళతాను." అన్నాను

"వెళతావా? ఎక్కడికి?"

"నా రూమ్‌కి!"

"భలేవాడివే! ఈరోజంతా నువ్వెక్కడికీ కదలవద్దు. యిక్కడే వుండి విశ్రాంతి తీసుకో!" అనేసి వెళ్ళిపోయారావిడ.

ఆవిడ మాటలు గట్టిగా తిరస్కరించాలని అనిపించినా, ఆచరణలో పెట్టలేక పోయాను.

సుదర్శనంగారు లేవగానే, ఆవిడ జరిగిందంతా చెప్పినట్టున్నారు నన్ను పిల్చారు! దగ్గరగా తన మంచం మీద కూర్చోమని, స్వయంగా గాయం పరీక్ష

చేసారు.

ఆయన కళ్ళలో తృప్తి గర్వం కదులాడాయి.

"భేష్! నా పత్రికకి తగ్గ వ్యక్తిని ఎన్నుకున్నాను! నా చిన్నతనం గుర్తుకు తెస్తున్నావు!" అంటూ తన మొదటిలో ఈ విధంగా రెండు మూడు సంఘటనలు చెప్పారు.

గతస్మృతులతో ఆయన కళ్ళలోకి జీవం వచ్చింది. ఆనందంలో అవి తళతళ లాడినాయి.

"తన రూమ్‌కి వెళిపోతానంటున్నాడు" ఆవిడ ఫిర్యాదు చేస్తున్నట్టుగా చెప్పారు.

ఆయనకూడా అంగీకరించలేను

"నా బట్టలన్నీ——" సణిగాను.

'డ్రైవర్ రాగానే నేను పంపి తెప్పిస్తాలే! ఆఫీస్‌కికూడా ఫోన్ చేస్తాను. కాగితా లేవైనా వుంటే పంపమని." అన్నారు.

కానీ ఆ రోజు డ్రైవర్ రాలేదు!

సూర్యానికి నా గది తెలియదు.

సుభద్రమ్మగారు బీరువాతెరిచి ప్రసాద్ రాత్రిపూట ధరించే పైజమా, షర్ట్ తీసి యిచ్చారు.

"నాకు సరిపోవేమో!" అన్నాను.

"వేసుకుని చూడు." అని వెళ్ళిపోయారు.

పొడుగు దాదాపు సరిపోయినా, ప్రసాద్ కంటే నేను లావు అవటంవల్ల గాస్త టైట్‌గా అయినాయి.

లేచి బైట తిరిగే పనిలేదు. కూర్చోవటానికి, పడుకోవటానికి ఏం యిబ్బంది లేదు!

ఆఫీసునుంచి సూర్యం ఆరోజు టపా, యింకా ముఖ్యంగా చూడాల్సిన కాగితాలు తెచ్చాడు.

నేను అవి చూస్తూ కూర్చున్నాను.

12 గంటలు అవుతుండగా ఆవిడ "రవీ! భోజనం వడ్డించాను రా!" అని పిల్చారు.

'మన దేశంలో మత సామరస్యం' అనే వ్యాసం వ్రాస్తున్నాను నేను. అది దాదాపు పూర్తి కావచ్చింది.

ఆఖరి పేజీ వ్రాస్తున్నాను

నేను గబ గబా ముగిస్తుండగా, యింతలో "ఇదేమిటి ప్రసాద్ గది తలుపులు తెరిచి వున్నాయే ఈరోజు!" అన్న భాస్కరం స్వరం వినిపించింది.

"నువ్వా! రా! రా! రవి వున్నాడు ఆ గదిలో." అన్న సుభద్రమ్మగారి జవాబు కూడా వినిపించింది.

నేను అప్పటికే వ్రాయడం పూర్తిచేసి కాగితాలు బొత్తిపెడుతున్నాను.

"రవీ! ఆ గదిలోనా!"

"రాత్రి యిక్కడే పడుకున్నాడు"

నేను గదిలోంచి బైటకి వస్తున్నాను!

భాస్కరం అప్పటికే అక్కడికి వచ్చాడు!

నన్ను చూడగానే అతని కళ్లు కొద్దిగా ఆశ్చర్యంతో పెద్దవైనాయి. ఒహంశా ఆ

ఆశ్చర్యం నేను ధరించిన బట్టలు చూసి కావచ్చు. గది గుమ్మంలోపల నేను, బైట అతనూ ఆగిపోయాం! అతని చూపులు నన్ను నిలువెల్లా ఒక్కసారి పరికించి నాయి! అక్కడ కనపడ్డ విపరీతమైన అసంతృప్తి కన్పించింది.

"భాస్కరం! నీకూ్కడా వడ్డించనా? భోజనం చేస్తావా?"

అతను వెనక్కు తిరిగాడు.

"అవసరం లేదు! నేను తినేసి వచ్చాను." ఆ మాటలుకూడా చాలా వాడిగా వచ్చినాయి.

నేను అతన్ని పలకరించకుండానే ఇవ తలకి వచ్చేసాను

నేను భోజనం చేసినంతసేవు భాస్క రం గదిలోనే వున్నాడు మా భోజనాలు అయింతర్వాత యివతలకి వచ్చాడు.

నేను గదిలోకి వెళ్ళాను!

కొద్దిసేపు పడుకుంటే బాగుండు నని స్తోంది!

భాస్కరం నాతో యింకేం మాట్లాడ దు.

నేను వచ్చి గదిలో పడుకున్నాను!

అలసటగా అనిపించటంతో, కళ్ళు మూసుకున్నాను!

దూరంగా వంటయింటి దగ్గరనుంచి మాటలు విన్పిస్తున్నాయి.

బహుశా అవి నేను వినాలనేమో!

భాస్కరం బిగ్గరగా అన్నాడు.

"ఏమిటది? మీ అందరికీ ఏమైనా మతి పోయిందా? ప్రసాద్ గదిలో ముక్కూ మొహం తెలియని ఎవరినో వుంచటము! అతని బట్టలు ఎరువు లివ్వటమా!"

"రవి మనం ఎరగనివాడెలా అవు తాడు?"

"లేక చాలా దగ్గరవాడంటావా? నాకు తెలియదులే! పిన్నీ! నువ్వు అమాయకు రాలివి! లోకం అంతా నీలాగానే మంచి వాళ్ళు అనుకుంటావు! ఎప్పుడో ఒకసారి ఈ మంచే నిన్ను గోతులోకి దించుతుంది. ఈ రోజు నూటికి నూరుపాళ్ళ మనుషులు గోముఖ వ్యాఘ్రాలే. మన కంటికి తోడు గానే కన్పిస్తువుంటారు. తీరా చేతులోకి తీసుకుంటె - పాములై కరుస్తారు. ఏకుల్లా మెత్త మెత్తగా వచ్చి, వటిగివుండి, మేకుల్లా మారిన మనుషుల్ని నేను చాలా మందిని చూసాను. ఆ తర్వాత విచారించి ప్రయోజనం లేదు. ముందే హెచ్చరిస్తు న్నాను. మీ యిష్టం! ఎవరికి ఎంత విలువ యివ్వాలో కాస్త ఆలోచించి మరీ యివ్వండి వస్తాను."

అతను వెళ్ళిపోవటం వినిపించింది.

అతను గదినుద్దేశించి యీ మాటలు విసిరాడు. నా మనసు చివుక్కుమంది. అక్కడి నుంచి సాధ్యమైనంత త్వరగా నా రూమ్‌కి వెళ్ళిపోవాలనిపించింది.

(సశేషం)



శ్రీ స్వరాజ్యలక్ష్మి ప్రొడక్షన్స్ వారి "ధైతే రాజులో" లో కాంతారావు.

అవుతుంది.

పిల్లలపట్ల ప్రేమే తల్లికిప్రాణమని అట్టి ప్రేమకోసం, ప్రాణంకోసం మాతృమూర్తి ఎంతత్యాగానికైనా సంసిద్ధురాలవే పరమ సత్యాన్ని నవంసభరితంగా చాటే ఈ చిత్ర దర్శకత్వం టి. మాధవరావు నెరపుతున్నారు.

సావిత్రి, శోభన్‌బాబు, చంద్రకళ, నాగభూషణం. ప్రభాకరరెడ్డి రాజబాబు, సంధ్యారాణి, మున్నగువారు తారాగణంలో వున్నారు. మాటలు, పాటలు: ఆచార్య ఆత్రేయ, సంగీతం: కె. వి. మహాదేవన్, నిర్వహణ: పతకమూరి నాగభూషణం. సమర్పణ: పతకమూరి సుబ్బారాయుడు.

## సతీ అనసూయ

బి ఎ.సుబ్బారావు దర్శకత్వంలో నిర్మించబడుతున్న శ్రీకాంత్ & శ్రీకాంత్ వారి సతీ అనసూయ, చిత్రీకరణం తొమ్మిది రీళ్ళవరకూ పూర్తయింది. ఇటీవలనే అనసూయి ఆశ్రమ దృశ్యాలను ఔట్‌డోర్‌లో చిత్రీకరించడం జరిగింది. జెమినీ స్టుడియోలో రంగుల్లో తయారౌతూన్న ఈ చిత్రంలోఇద్దరు ప్రఖ్యాత నర్తకీమణులు జ్యోతిలక్ష్మి, వెన్నిరాడై, నిర్మల-చక్కని నృత్యాలుచేశారు.

జమున, శారద, కాంతారావు,శోభన్ బాబు, సత్యనారాయణ, రాజనాల, రాజబాబు, ప్రభాకరరెడ్డి మున్నగువారు నటిస్తున్నారు. సంభాషణలు: సముద్రాల జూ॥ పాటలు: సినారె, కొసరాజు, అప్పుద్ర దాశరథి, సముద్రాల జూ॥ కెమెరా: శ్రీకాంత్, సంగీతం: ఆదినారాయణరావు. నిర్మాతలు: శ్రీకాంత్ నహతా, శ్రీకాంత్ పటేల్. పంపిణీదారులు: రాజశ్రీ పిక్చర్స్.

## విశ్వభారతి ప్రొడక్షన్స్

ఇటీవలనే నవీనపద్ధతిలో కళాదర్శకుడు జి.వి. సుబ్బారావు నిర్మించిన హీరోభవనం



శ్రీకాంత్ అండ్ శ్రీకాంత్ వారి రంగుల చిత్రం

"సతీ అనసూయ" చిత్రంలో జమున, శోభన్‌బాబు.



విజయా అండ్ సురేష్ కంబైన్స్ వారి 'ప్రాహి'లో జగ్గయ్య, వాణిశ్రీ

---

సెట్లో కొన్నిసన్నివేశాల్ని దర్శకులు ప్రత్యగాత్మ చక్కగా చిత్రీకరించేరు దాశరధి రచించగా ఘంటసాల సుశీల పాడిన "కొంటె చూపులెందుకు లేరా

జుంటి తేనెలందిస్తారా"

పాటను హీరో నాగేశ్వరరావు, జయకుమారిలపై చక్కగా చలిపాడు నాలుగైదు రోజుల్లో మరి రెండుపాటల రికార్డింగ్ జరుగనున్నది నాగేశ్వరరావు, గుమ్మడి, రాజబాబు, రమణారెడ్డి జమున, సూర్యకాంతం జయకుమారి మున్నగువారు ముఖ్యతారాగణం

మల్లెపూడి వెంకటరమణ, దాశరధి, ఆరుద్ర, కొసరాజు, టి చలపతిరావు, కె యస్ రామకృష్ణ ముఖ్యసాంకేతికవర్గం నిర్మాత: జి. రాధాకృష్ణమూర్తి, దర్శకత్వం: కె. ప్రత్యగాత్మ.

## సవతి తల్లి

గోల్డెన్ పిక్చర్స్‌వారి 'సవతితల్లి' స్క్రిప్టు వర్క్ త్వరితంగా సాగుతోంది. శ్రీమతి సూర్యకాంతం 'టైటిల్ రోల్' నిర్వహిస్తున్నారు. ఈ చిత్రం ద్వారా కొండిసెట్టి రామారావు ఉపనాయకుడిగా ప్రేక్షకులకి పరిచయ మవుతున్నారు. నాగయ్య హరనాథ్‌లు ముఖ్య తారాగణంలో వున్నారు. కథ సంభాషణలు; పి. కనకాంబరరాజు ఈ కుటుంబ కథా చిత్రాన్ని డైరెక్టు చేస్తున్నది పి సాంబశివరావు నిర్మాత పోతిన శ్రీరాములు

## సంజీవిని ఫిలింస్

## ప్రొడక్షన్ నెం 2

కాంతారావు కృష్ణ, రాజబాబు, ధూళిపాళ అల్లురామలింగయ్య, రాజశ్రీ, సంధ్యారాణి, నిర్మల మున్నగు ప్రముఖ నటీనటులతో జి రామం చంద్రశేఖర్‌లు నిర్మిస్తూన్న ఈ చిత్రం నవంబర్ ఆఖరికి పూర్తి కాగలదు సంభాషణలు విద్వాన్ కణ్వశ్రీ సంగీతం విజయా కృష్ణమూర్తి కెమెరా అన్నయ్య దర్శకుడు కె ఎస్ ఆర్ దాస్ ఈ చిత్రం పూర్ణావారి ద్వారా ఆంధ్రలో విడుదల కాగలదు

## విజయనిర్మలా పిక్చర్స్

విశాలాంధ్రలో చలన చిత్రాలకి పంపిణీ భాగాలు మూడున్నాయి వాటిలో సీడెడ్



ఉత్తమ చిత్ర "మనసూ మాంగల్యం"లో జమున, నాగేశ్వరరావు.





పి. యస్. ఆర్. పిక్చర్స్ వారి "విక్రమార్క విజయం"లో రాజశ్రీ, ధనశ్రీ.



సావిత్రీ కంబైన్స్ వారి "వియత్నాం ఇల్లు" సాంగ్ రికార్డింగ్ ప్రారంభోత్సవం విజయదశమి రోజున విజయా గార్డెన్స్‌లో జరిగిన సందర్భంలో విచ్చేసిన శ్రీ బి నాగిరెడ్డితో నిర్మాత దర్శకురాలు శ్రీమతి సావిత్రి

ఎరియా చిత్రాల విజయానికి ప్రముఖ పాత్ర వహిస్తున్నది ఇటీవల తిరుపతిలో విజయనిర్మలా ఎక్చర్స్ డిస్ట్రిబ్యూషన్ ఆఫీసు సీడెడ్ ఏరియాకి వెలిసింది ఈ సంస్థకి శ్రీ ఎ హెచ్ ఎన్ వర్మ అధినేత

## చిత్రకళా మూవీస్

ఇటీవలే రాజేంద్ర ఆర్ట్ ప్రొడక్షన్స్ బేనర్ కింద విజయం మనదే చిత్రాన్ని సమర్పించిన శ్రీ నందమూరి సాంబశివరావు మరో నూతన సంస్థను చిత్రకళామూవీస్ పేరిట విజయదశమి నాడు ప్రారంభించేరు వీరి మొదటి చిత్రాన్ని ఎన్ రమేష్ డైరెక్టు చేస్తారు ఈ చిత్రం పేపర్ వర్క్ ప్రస్తుతం జరుగుతోంది

## దసరా బుల్లోడు

షూటింగూ రీ రికార్డింగూ పూర్తయిన జగపతి ఆర్ట్స్ ఎక్చర్స్ వారి రంగుల దసరా బుల్లోడు సంక్రాంతి నాడు విడుదల కావడానికి సర్వ సన్నాహాలూ పూర్తి చేసుకుంటున్నాడు చక్కని సంగీతం ఈ చిత్రంలో మరో ప్రత్యేక ఆకర్షణ నాగేశ్వరరావు యస్ వి రంగారావు గుమ్మడి నాగభూషణం పద్మనాభం రావికొండలరావు వాణిశ్రీ చంద్రకళ అంజలీదేవి సూర్యకాంతం రాధాకుమారి బేబీరాణి ముఖ్య తారాగణంలో వున్నారు

దర్శక నిర్మాత రాజేంద్రప్రసాద్ జూన్ 71 ప్రాంతాలలో అక్కినేని నాగేశ్వరరావుతో మరో చిత్రం ప్రారంభించనున్నారు జగపతి ఎక్చర్స్ బేనర్‌పై నిర్మించబడే ఈ చిత్రానికి బంగారు బాబు అని నామకరణం చేశారు

—పాల్

# పానగల్ పార్కులో

—యామిజాల పద్మనాభస్వామి

"స్వామీజీ! యివాళ సరిగ్గా అనుకున్నట్టే వచ్చావు ఏమిటి విశేషం?" అన్నాడు గోవిందరావు నన్ను చూసి

"ఏమీలేదు ఇంటిపనులివాళ ఏమీ చూడక్కరలేదు, మీ దర్బారుకి వెళ్ళవచ్చు" అని యింత కాఫీ యిచ్చి మా గృహలక్ష్మి అనుగ్రహించింది

"అప్పుడప్పుడు ఇంటి పనులు చేస్తూ వుంటావన్న మాట!"

"లేదు అంతా నీలాగే సన్యాసులనుకున్నావు" అని నవ్వి శర్మగారు సిగరెట్ పెట్టె అగ్గిపెట్టె అందించారు గోవిందరావుకి,

"నేను సన్యాసినా?" అన్నాడు సిగరెట్ వెలిగించి గోవిందరావు.

"కాదు సిసలైన సంసారివి భార్యావిధేయుడవు, అపర కృష్ణుడవు" అన్నాడు లక్ష్మణశాస్త్రి

"అరి నీ దుంప తెగ నే నొక్కణ్ణే భార్యా విధేయుణ్ని మీరందరూ బరే మగరాయుళ్ళున్నా! ఏమి శర్మా! ఏమనవు?"

"ఏమనేది? ఏమన్నా నా మీద పడతారు మీరు ముగ్గురున్నూ తువ్వాలు దులుపుకొని తుండూ తుపాకీ లేకుండా యిల్లు వదిలి వచ్చిన వాడను నేను నేనే మనేది?

"శ్రీ శుకుడివి అపర వసిష్ఠుడివి. అందుకే నిన్నడగడం"

"నన్ను అంత లేపి బిరుదులతో సత్కరించనక్కరలేదుగాని నా మాట అయితే చెప్తా విను"

త్రిమూర్తులే భార్యా విధేయులయి వుండగా నరమాత్రులం మన మొక లెక్కా

"ఆ! అదీమాట! వేలకి విలువయిన మాట అన్నావు ఏదీ షేక్ హాండ్-ఇంకొక సిగరెట్ ముక్క యిలా రానీ! అని చెయ్యి చాచేడు గోవిందరావు

"నీ ముష్టి ముక్కలుగాను తేరగా వచ్చిందని" అన్నాడు ప్రకాశరావు

"ప్రకాశం! నీకు ఎంత చదువున్నా గాడిద గంధపు కట్టెల మోపు మోస్తూన్నట్టే అనుభవంలోకి తెచ్చుకోవద్దు మహావిష్ణువంటివాడు యింతవాడై పోయి రాక్షసుడి దగ్గర చేయి చాచేడు అదీ మూడడుగుల అంతవాడికే ఆ గతి పడితే నీకూ నాకూ వచ్చింది పెనుగాలికి కొండల్లాంటి ఏనుగు లెగిర పోతూంటే దోమలపాట్లు వేరే చెప్పాలా? ఏమంటావు స్వామిజీ!




మితవాదివిగా చూస్తూ దరహాసాలు విసురుతున్నావు"

"బాబు ఎప్పుడూ మితవాదే" అన్నారు శర్మగారు

"అయితే నేను అతివాది నన్నమాట"

"అన్నమాటేమిటి ఉన్నమాట"

"అయితే మన మురాలో కూడా పక్షా లున్నాయంటావు"

"ఎందుకుండ కూడదూ?"

మన కళ్ళ ముందు జరుగుతూన్నది చెప్తా విను, శ్రీశ్రీని అనుకరించి అనుసరించి పీఠాధార్యుడుగా వరించి అడుగులకు మడుగులొత్తి అందల మెక్కించి మేళ తాళాలతో 'హే శ్మరథా' అని ఆకాశాని కెత్తినవాళ్ళు యింతలోనే రెండు పక్షాలయిపోయారు ఒక పక్షం వారు చిల్లర దుకాణం చుట్టూ కబుర్లతో శ్రీశ్రీ కీర్తికి 'చిచ్చి' కొట్టుతున్నారు ఈ గవ్వకాయ పాపానికి ఎందుకు దిగవలసి వచ్చిందో నాకు బోధపడలేదు' అని కసింత కారంగానే అన్నారు శర్మగారు.

"నీ ధోరణి చూస్తే శ్రీశ్రీ పక్షం వాడిలాగా వున్నావు" అన్నాడు గోవిందరావు నవ్వుతూ

"నేను ఏ పక్షానికీ చేరేవాణ్ని కాను. ధర్మపక్షవాదిని నేను ఇంకోమాట విను శ్రీశ్రీని స్వార్థవాదిగా చూస్తున్నారు కొందరు బుద్ధిమదగ్రగణ్యులు"

'సర్వేః స్వార్థం సమీహతే' స్వార్థం కోరుకోని వాడెవడో ఒక్కణ్ణి వేలుమడిచి

చెప్పి రుజువుచేస్తే నా వాదం తప్పని తల వంచి దోసిలొగ్గి నమస్కరిస్తాను వెనక నించి గోతులు తవ్వడం తెలుగుజాతికి పట్టిన మొండి తెగులు దీనికి దైవమే ఏదేనా చికిత్స చెయ్యాలిగాని మానవ మాత్రుడు చెయ్యలేడు

"సరేగాని నా ధర్మసందేహం ఒకటి" అన్నాడు ప్రకాశరావు

"ఏమిటది?" అన్నారు శర్మగారు

"ఇల్లాలిని గృహలక్ష్మి అని ఎందు కన్నారు?"

"బాబూ! యీమధ్య భారతం చదువు తున్నానన్నారు. ఈ ప్రశ్నకి ఎక్కడైనా సమాధానం వచ్చినఘట్టం వుందా?" అని నన్ను చూసి అన్నారు శర్మగారు

నేను నవ్వి "మీకు తెలియదా? సెలవ యిందికనక చెప్పాను"

"భారతం ఆనుశాసనిక పర్వములో ప్రథమాశ్వాసములో వుంది నిత్య సత్య వ్రతము, బాహ్యాంతరశుద్ధి, గురుభక్తి, చేయవలసే పనులలో పొరపాటు లేకుండుట, ఎ పనిచేసినా నెరవేరేవరకూ ధైర్య స్థయిర్యాలుతో చేయుట, దుశ్చింత లేకుండుట, మంచిపనులేచేయుట, ఆత్మజ్ఞానము, శ్రద్ధ, వినయము, దానగుణము, బ్రహ్మచర్యము, - అనే యీ లక్షణాలుగల వారి దగ్గర ఉంటాను. వంట, భోజనం కాగానే ఇంటిని శుద్ధిచేసి, పాత్రలను శుభ్రంగా తోమి ఉంచుతూ, ఎక్కడ చూసినా శుచిగా కల కలలాడుతూ వినయ వివేకముతో గృహాన్ని నడిపే యిల్లాలియందు నేనుంటాను పతి వ్యతిరేకంగా ప్రవర్తిస్తూ, మొండితనము ప్రదర్శిస్తూ, చీటికీ మాటికీ ఇరుగు పొరుగువాళ్ళ యిళ్ళకి వెళ్ళుతూ, పనికిమాలిన కబుర్లతో కాలం గడుపుతో, చిరుతిళ్ళు తింటూ కడుపునింపుకుంటూ, పగలు నిద్రిస్తూ, చిరమరలాడుతూ వుండే యిల్లాలిని విడిచి వెళ్ళిపోతాను అని లక్ష్మీదేవి తన నివాసం చెప్పింది, ఆమె ఉండేట్టు ప్రవర్తించడం యిల్లాలి విధి అలావుండేది గృహలక్ష్మి

"విన్నావోయ్ ప్రకాశం!" అన్నారు శర్మగారు

"విన్నాను ఆమె చెప్పినట్టు చెయ్యడం అట్టే కష్టమయినది కాదే

"కాదు. కాని అవే చెయ్యనివారు వుంటారు కొందరు గృహ లక్ష్ములు."

"సజావుగా అనవుకదా ఏమన్నా" అన్నారు శర్మగారు

"శర్మా! చట్టున అనకూడదు పెద్దవాడవు నా బుద్ధినిబట్టి నామాట వుంటుంది. నేనేమిటన్నాను కొందరుంటారు గృహలక్ష్మలనేకదా! జీతం తేగానే పైసలతో సహా యిల్లాలి చేతికి సమర్పించాలి అప్పుడామె గృహలక్ష్మి కాలేదటయ్యా?"

"నీ సమర్థన బాగానే వుందిలే రెండి బాబుకి (నాకు) భోజనానికి వేళయింది ఏడు గంటలు కాలే

"అవునవును పాల పాపడు" అని గోవిందరావు నాచెయ్యపట్టుకునిలేచాడు. ●

గ్రంథ సమీక్ష

# ఝుంఝు

(గేయ సంకలనం)

(సంకలన కర్త శ్రీ కె వి రమణా రెడ్డి

ప్రతులకు నిఖిలేశ్వర్

46, విద్యానగర్ కాలనీ.

హైదరాబాదు-13

వెల ఒక్కరూపాయి )

భారతదేశం పరాయి దొరతనం కింద ముక్కుతూ మూలుగుతూ అణగి, మణగి స్వతంత్రంగా ఊపిరి పీల్చుకోలేక పడి వున్న కాలములో స్వాతంత్ర్యం సంపాదించడానికి భారతీయులు అసూతాలనూ విఘాతాలనూ లక్ష్య పెట్టక ముందు కురికారు బాలగంగాధర తిలక్ వంటి సాహసికులు విలయ గర్జనం చేస్తున్న కాలం అది లజపతిరాయ్ వంటి సింహాలు బలవన్మరణం పాలయిన పాడు ఉవసాలవి, మోహనదాస్ కరంచంద్ గాంధీ నాయకుడుగా ముందడుగు వేస్తున్న రోజులు, ఆనాడు జాతీయ సేవాసంస్థలో రెండు పక్షాలు ఏర్పడ్డాయి అతివాదులు, మితవాదులు అని క్రమేణా అతి వాదుల బలం తగ్గి మితవాదులదే పైచేయి అయింది రాద్ధాంతాలు ఎలా వున్నా సిద్ధాంతం ఒక్కటే అది పరాయి పాలన విముక్తి ఆనాడు కవులు కూడా వివిధ రచనలు చేసి అటు అక్షరాస్యులనూ ఇటు నిరక్షరాస్యులనూ కూడా ఉద్రిక్తులను చేశారు

'మా కొద్దీ తెల్ల దొరతనము—' వంటి పాటలు ఇంటింటా ఉత్సాహ జ్యోతులను వెలిగించాయి స్వార్థం చూసుకోక సామాజిక భవ్య జీవన సౌఖ్యం లక్ష్యంగా స్వతంత్ర యుద్ధ రంగంలో తను ధనత్యాగం చేశారు భారతీయులు అసంఖ్యాకంగా, స్వాతంత్ర్యం వచ్చింది. - మితవాది పక్షమే విజయం సాధించింది. ఇది ఎవరూ కాదనజాలని సత్య చరిత్ర.

ఈనాడు స్వతంత్ర భారతంలో ప్రత్యేకించిఆంధ్రదేశానికిసంబంధించిన రచయితలలో రెండు సంఘాలు బయలుదేరాయి. ఒకటి అరసం రెండోది విరసం. అరసంలోనే విరసం పుట్టి కొందరు సభ్యులు వేరయి కొత్తగా కొందరు చేరి ఏర్పడ్డది విరసం

ఏ సంఘం బయలుదేరినా ఎదుటి సంఘాన్ని కుదించి కూలదన్నుతూ ఏవేవో మొరకు రాతలతో శిలాశకలాలు అక్షతలుగా విహరించడం విజ్ఞులు కాదు కదా అజ్ఞులు కూడా హర్షించరు అభ్యుదయ రచయితల సంఘం వారు విప్లవ రచయితల సంఘం మీద రాళ్ళు విసురుతే వీరు వారి మీద విసర నారంభిస్తున్నారు. ఇదేదో తమాషాగా చూస్తూ కొందరు వినోదిస్తున్నారు కొందరు పుడకలు వేస్తున్నారు తెలిసీ తెలియని వారు దిగ్భ్రాంతులై దిక్కులు చూస్తున్నారు. ఫలితం? ఈ రెండు సంఘాలూ వాలిసుగ్రీవ యుద్ధ కాండను పునరావృత్తం చెయ్యడమే అది నాకు తోచిన యీ నాలుగు మాటలూ యిలా రాయవలసి వచ్చింది. యీపై రెండు సంఘాలలోనూ వున్న

కొందరు రచయితలు రచనా వ్యాసంగ దృష్టా నాకు మిత్రులై వున్నారు కనక యిలాటి దూషణ కొండకు స్వస్తి చెప్పి సామాన్య జీవితానికి మాన్యత కలిగించే రచనలతో ఏకవాక్యతగా ముందజవేయడం ఉభయ తారకమవుతుందని సూచిస్తూ యీ 'ఝంఝ' ను గూర్చి నాకు తోచిన మాటలు నాలుగు వ్రాస్తాను

'తెర వెనుక అనే గేయంలో గ్రీన్ రూంలోకి వెధవ ల్నెవర్నీ

రానీకు నేస్తం-అనే వాక్యంలో 'వెధవ' పదం వుద్రేకం కలిగించడానికి బదులు వికారాన్ని కలిగిస్తుంది గేయ మర్యాద భగ్నమయింది

ప్రపంచంనిండా అనే గేయంలో చెర బండరాజు చెప్పిన తీరు బాగున్నాది ఆహ్వానమూ ఆ వేదనా స్పష్టంగా నిర్ద ష్టంగా చెప్పాడాయన 'జ్వా లా ము ఖి' రచన పరువుగా, బరువుగా వుంది మల్లెల నారాయణ 'శాస్త్ర పురాణాదుల భావపిశా చాదులను' కట్టుకోలేక ఏమో అనడం నేల విడిచిన సాము

నిఖిలేశ్వర్-'భయ'గీతం వింత ప్రబో ధానికి అభయగీతం 'మహోషస్సు'— శ్రీ శ్రీ భావాలకు 'కాపీ' అయినా చెప్పిన తీరు బాగుంది

కె వి రమణారెడ్డి 'అ-క్రమం' వ్యంగ్య వైభవాన్ని పోషించుకుంటూ పిడుగుల జడిని అర్థం చేసుకోమంటూంది ప్రబోధ గీతాలు ఈ తీరులో వుండాలనినా వుద్దేశం లోచన్-'రైట్ టు ఓట్ కాదు' గేయం కేవలం కసాయివాడి కత్తిలాగా వుంది. సున్నితమైన హృదికలవాళ్ళు భయపడ తారు రచయిత ప్రయత్నం యీలాటి గేయాలతో సఫలం కాదని నా వూహ. 'జాతీయ వంచకుల బహ్మాష్ డ్రామాలు'- 'కొండమంగలి వెధవల చేతులు-వంటి ప్రయోగాలు అక్కసుని ప్రకటిస్తాయి గాని జాతీయ ప్రబోధానికి వుండవలసే ఔచి త్యాన్ని పోషించవు ఈ గేయం అమ్మని తిట్టకురా లంజకొడకా' అని అన్నతమ్ముణ్ణి మందలించి నట్టుంది

వరవరరావు రక్షించండి' గేయం ఉదాత్తతనూ, ఉద్రిక్తతనూ పడుగు— పేకలా కూర్చుకున్నది

విజయలక్ష్మి గేయములో మూడు అయిదు భాగాలు మోటుగా వున్నాయి ఒక బోటి ఇలా చెప్పడం నీటుగా లేదు

ఇపుడు 'సత్యం చావదు(డు) యువకో ద్రేకభావాలకు జ్యోతి యీ కృతికి నామ కరణం యిచ్చినది శ్రీ శ్రీ గేయం 'ఝంఝ'—

మంటలచేత మాట్లాడించడం, రక్తం చేత రాగాలాపన చేయించడం శ్రీ శ్రీ కి పుట్టుసొమ్ము

రమణారెడ్డిగారి ముందున్న మాటలు బాగానే వున్నాయి నిదానంగా అర్థం చేసుకోవాలి చూదాం ఫలితం.

—యామిజాల.

# Dear Advertiser,

SORRY

JYOTI HAS NO READERS

JYOTI has only ard nt fanatios They will feel hurt if you call them just read rs but won't express for they are too cultivated JYOTI fans b long to a big growing brotherhood They talk JYOTI feel JYOTI and think JYOTI for it fills their lives with sweetness and li ht Every Month new JYOTI addicts smuggle this monthly home until they are found out by other members of the family JYOTI fans are individuals m n wom n young and old and therefore all the God s variety There are now atleast a Lakh of them all over Andhra Pradesh and wherever Telugu is spoken

Ineffable masterpi ces funny stories tense serials gre t you with breezy cartoons thrown judiciously in Every copy of JYOTI is bought smuggled stolen grabb d or just surrendered to b read reread to b bound circulated and treasured to be boasted of and coveted

Think of JYOTI the friendliest of Andhra's magazines bettering its best in the years to came ?

*This we have said about ourselves in 1964 We stil feel Proud of it*

**For particulars please write to**

**ADVERTISEMENT MANAGER**

# JYOTI

**Illustrated Telugu Monthly**

**26, Burket Road, MADRAS-17**